# పీఠిక.

ఈ చిన్న గ్రంథములోని విషయములు ప్రతికుటుంబములోనివారికి తెలిసియుండుటమంచిది. స్త్రీలును బాలురును ముఖ్యముగా చదువతగినది. ఇందు సులభచికిత్సలు వ్యాధినివారణోపాయములు సులభశైలిని వ్రాయబడినవి. గ్రామపునర్నిర్మాణోద్యోగులు యీచిన్నగ్రంథముయొక్క ఉపయోగమును గనిపెట్టి పాఠశాలయందు పాఠములుగా చదివించునట్లు చేయుదురని కోరెదను. ఇందలిసంగతులన్నియు ప్రసిద్ధిగల వైద్యగ్రంథములనుండి వ్రాయబడినవి. ఈగ్రంథము తేలికమాటలతోను వాడుకపదములతోను సర్వజనోపయోగమగు నటుల వ్రాయబడినది.

పాలమూరు
1—8—1928

ఇట్లు గ్రంథకర్త
డాక్టర్ కె. బి. శర్మ

# విషయసూచిక


| | |
|---|---|
| అజీర్ణము | 1 |
| అతిసారము | 1 |
| ఉబ్బసము | 2 |
| కంఠకలక | 2 |
| కవురు దెబ్బలు | 3 |
| కడుపునొప్పి | 3 |
| కాలిసప్పుండ్లు | 4 |
| కాలివేళ్ళమధ్యఒరుపులు | 4 |
| కోరింతదగ్గు | 4 |
| గజ్జి | 5 |
| గవదలు | 5 |
| గోరుచుట్టు | 5 |
| గ్రహణి | 6 |
| చనుకుదురు | 6 |
| చెవిలో చీము పోటు | 7 |
| తలనొప్పి | 7 |
| తలమీదచుండ్రు | 7 |
| తామర | 8 |
| దగ్గు | 8 |
| నాలుకపూత | 8 |
| పుప్పిపన్ను | 9 |
| బాలపాపచిహ్నాలు | 9 |
| మలబద్ధము | 10 |

వెక్కిళ్ళు 11

రొంప 11

విరేచనములగుటకు 12

శగగడ్డలు 12

సర్పి 13

## ఆకస్మిక వ్యాధులు 13

రక్తముకారుట 13

కడుపులోనుంచి రక్తముకారుట 14

ముక్కులోనుండిరక్తముకారుట 14

ముక్కులో గింజదూరుట 15

చెవిలో పురుగుగాని దోమగాని దూరుట 15

కంటిలోనలుసు 15

బెణుకులు 16

మూర్ఛ 16

ఎండదెబ్బ 17

గుడ్డలకు నిప్పుఅంటుకొనుట 17

నీటిబ్రిమాడము 18

పాముకాటు 21

పాములురాకుండ జేసికొనుట 22

వెర్రికుక్కలు మొదలగునవి కరచుట 23

తేలుకుట్టుట 24

కొన్నివ్యాధులకు తగినఔషధములనుదెలుపుపట్టి 24

# అజీర్ణము

1 లవణార్ద్రికము:— పరగడుపున ఉప్పు, అల్లము చేర్చి సేవించిన అరుచిహరించి, అగ్నిదీప్తి కలుగును.

2 శొంఠ్యాదిచూర్ణము:— యావక్షారము, శొంఠి సమభాగములు చూర్ణముచేసి ఆవునేతితో కలిపి ఉదయమున పుచ్చుకోవలెను. లేక శొంఠిచూర్ణమును సేవించి నీరు త్రాగిన ఆకలిపుట్టును.

---

# అతిసారము

1 అభయాదివటిక:— కరక్కాయ, శొంఠి, తుంగగడ్డలు, బెల్లముతో సమముగా చేసినమాత్రలు చేసిసేవించవలెను.

2 కుంకుమవటిక:— కుంకుమపువ్వు, నల్లమందు, తేనెలోనూరి బియ్యపుగింజలవలె మాత్రలుచేసి వాడవలెను.

3 జాతీఫలాదివటిక:— జాజికాయ, నల్లమందు, ఖర్జూరము సమభాగములు తామలపాకు రసముతోనూరి మాత్రలుచేసి పుచ్చుకోవలెను.

4 కవిరి, దాల్చినచెక్క సమభాగములు చూర్ణించి తేనెతో మర్దించి మాత్రలు చేసుకొనవలెను.

# ఉబ్బసము

1 నాలుగు వడ్లగింజలయెత్తు హారతికర్పూరమును నాలుగువడ్లగింజలయెత్తు యింగువయును కలిపిమాత్రచేసి రెగంటలకొక సారియెక్కువ బాధగానున్నప్పుడు యివ్వవలెను.

2 నల్లవుమ్మెత్త ఆకులు. సూరేకారము, నిప్పుమీద వేసి వాట్లపొగను పీల్చవలెను.

3 మిరియాలచూర్ణములో తేనె, కండశర్కర, సమంగా కలిపి పుచ్చుకోవలయును.

---

# కండ్లకలకకు

1 ఒక ఔన్సునీటిలో 3 వడ్లగింజలయెత్తు పటికవేసి ఆనీరుఅప్పుడప్పుడు కంటిలోపోయుచుండవలెను. 3 వడ్లగింజలయెత్తు పటిక చాలనిచో 6 వడ్లగింజలయెత్తువరకు హెచ్చించవచ్చును.

2 ఇండుపగింజతో గంధముతీసికండ్లలోపెట్టవలెను.

3 మాచిపత్రి నేతితోవెచ్చచేసి కంటికికట్టినచో కంటిఎరుపుతగ్గును.

4 కరక్కాయ మంచినీటితో అరగదీసి కండ్లలో పెట్టినచో కండ్లదురదలు, ఒరుపులుపోవును.

ములో కలిపితయారైన మిశ్రమము ప్రతిగంటకు కంటి లోకొన్ని బొట్లు వేయవలెను.

6 ఒకఔన్సు పసుపుకొమ్మునునూరి, దానిని 20 ఔన్సుల పరిశుద్ధజలములోపోసి కషాయముచేసి ఒకగుడ్డఆ కషాయములో తడిపి కలిగిన కంటిమీద తరుచుగా ఉంచుకొనుచుండవలెను.

---

## కపుకుదెబ్బలకు

1 వేడినీళ్ళ కాపడము పెట్టవలెను.

2 చింతపండు సున్నము ఉడికించి కట్టవలెను.

3 బాలింతబోలు నిమ్మపండ్లరసముతో నూరి పట్టు వేయవలెను.

4 కలబందమట్ట పసుపుతోనూరి కట్టవలెను.

---

## కడుపునొప్పి

1 సరిగా ఆహారము జీర్ణముగాక యీనొప్పివచ్చును. అప్పుడుతక్షణము విరేచనమగుటకు మందుపుచ్చుకోవలెను.

2 ఉప్పు, వాము నమలి నీరుత్రాగి మింగవలెను.

3 కొంచెము యింగువ మాత్రగాచేసి మింగిన నొప్పిశాంతించును.

4 వేడినీటితో గాని, ఉప్పు వెచ్చచేసిగాని కడుపు కాచవలెను.

---

## కాలిన పుండ్లకు

గాలి తగులకుండ చేయవలెను.

1 సున్నపునీరును, వేపనూనెయును, సమభాగములుగా గలిపి చేసిన తైలమును ఆకాలిన భాగముమీదపట్టించవలెను. లేనిచో ఆతైలములో గుడ్డతడిపి ఆగుడ్డను కాలినచోట ఉంచవలెను.

2 గుగ్గిలము సున్నపునీటితో మెత్తగానూరి మరగినమంచి నూనెలోవేసి దింపుకొని వ్రాయవలెను.

---

## కాలి వ్రేళ్లమధ్య ఒరుపులకు

(1) నూనె, పసుపు కలిపి భద్రపరుచుకొని ఒరిసినచోట అప్పుడప్పుడు వ్రాయుచుండేది.

---

## కోరింతదగ్గు

1 పిల్లవాని వయస్సునుబట్టి నవాసాగరం 1 వడ్లగింజయెత్తు మొదలు 5 వడ్లగింజలయెత్తువరకు దాల్చినిచెక్క చూర్ణముతో కలిపియివ్వవలెను.

---

## గజ్జి.

1 గంధకము మెత్తగాచూర్ణముచేసినది 1భాగము కర్రినూనెగాని; వేపనూనె నువ్వులనూనెగాని 6 భాగములు కలిపి గజ్జిఉన్నచోట ప్రతిరోజు పట్టించవలెను., సబ్బుతోను వేడినీటితోను ఆభాగము శుభ్రముచేయుచుండవలెను.

2 వేపనూనె, కొబ్బరినూనె, హారతికర్పూరము కలిపి వ్రాయవలెను.

3 పరిశుభ్రమైన కిరసన్‌నూనెయు మంచినూనెయు ను సమభాగములుగ కలిపి వ్రాయవలెను.

---

## గవద.

1 వేడినీటికాపడము తరుచు పెట్టుచుండవలెను.

2 అవిసియాకు పసరువ్రాసి దానిపైని దూది అంటించవలెను.

3 నల్లమందు, హారతికర్పూరము సమంగా కలిపి నూరి కొబ్బరినూనెతో వ్రాయవలెను.

---

## గోరుచుట్టు.

1 నిమ్మపండుకు రంధ్రముచేసి ఆగోరును దానిలో నుంచవలెను.

2 పారాణి అనగా పసుపు, సున్నము కలిపిన మిశ్రమమును ఆవ్రేలికి పట్టించవలెను.

## గ్రహణి.

1 పచ్చివెలగకాయ తినవలెను. దీనిలో 'టానిక్ యాసిడ్' ఉన్నదిగనుక గ్రహణికట్టును.

2 శ్రీఫలాదికల్కము:—లేతమారేడుకాయకల్కముచేసి అందు శొంఠిచూర్ణమును బెల్లమును చేర్చి సేవించవలెను.

3 ముస్తాదిచూర్ణము:—తుంగముస్తలు. అతివస, మారేడుపండులోనిగుంజు; కొడిసిపాలవిత్తులు తెచ్చిమెత్తగాచూర్ణించి తేనెతో మర్దించి మాత్రలుకట్టి సేవించేది.

4 దాడిమాతిపానకము:—దానిమ్మగింజల రసము తీసి; దానిలో పంచదారకలిపి పానకము తయారుచేసికొని ¼ తులంమొదలు 1 తులం పానకము నీటితో పుచ్చుకొనవలెను.

---

## చనుకుదురు.

1 మల్లిపువ్వులునూరి కట్టవలెను.

2 వేడినీళ్ళకాపడము పెట్టవలెను.

3 తమలపాకులు వెచ్చచేసి స్తనములమీద వేయువలెను.

4 పసుపు; తుమ్మాకునూరి బిళ్ళగాచేసి కట్టిన పాలు యెండును.

---

## చెవిలో చీము పోటు.

చెవిలో చీముఉన్నచో ఒకదూదెకుంచెతో చెవిలోని చీమును తీసివేసి చెవిని ముందుగాశుభ్రపరచవలెను.

1 ఒకవంతు పసుపు, పటిక 2 వంతులు మెత్తగానూరి చెవిలో వేయవలెను.

2 అర్క పత్రిరసం:—పండుజిల్లేడాకులకు నెయ్యి పట్టించి నిప్పుమీద వెచ్చచేసి రసముతీసి చెవిలోపోయవలెను.

3 హింగ్వాది తైలం:— ఇంగువ, సైంధలవణం, శొంఠి వీటిగంధమునందు ఆవనూనె కల్పికాచివేయవలెను.

---

## తలనొప్పికి.

1 శొంఠిగంధము పట్టువేయవలెను.

2 కచ్చూరములు. మంచిగంధము, హారతికర్పూరము కలిపినూరి కణతలకు పట్టువేయవలెను.

3 యూకలిప్టస్ఆయిలు కణతలకు రాసుకోవలెను

---

## తలమీదచుండ్రు.

1 మైలతుత్తం; 20 వడ్లగింజలయెత్తు; మాచికాయచూర్ణము 1 డ్రాము; ఒక ఔన్సువెన్నలోకలిపి వ్రాయవలెను.

2 బొప్పాయికాయముక్కలు తలమీద కట్టిక రుద్దవలెను.

3 సీమఅవిశెనూనె పలుమారు వ్రాయుచుండవలెను.

## తామరకు

1 తంగెపువేరు నిమ్మపండ్లరసముతో నూరి పట్టించవలెను. తంగెపుగింజలలో 'క్రిసోఫానిక్ యాసిడ్' గల దని కనిపెట్టిరి. అందుచేతనే యీమూలిక తామరకు మంచిపనిచేయును.

## దగ్గులకు

1 పథ్యాదిగుటిక;— కరక్కాయబెరడు; శొంఠి; తుంగముస్తలు; బెల్లం; సమభాగములుచేసి నూరి మాత్రలుచేసి బుగ్గన పెట్టుకోవలెను.

2 దుంపరాష్ట్రం; కరక్కాయవలపు; వస; వాకుడువేరు బాగుగా ఎండించి సమంగా చూర్ణించి పంచదారతో పాకంపట్టి లేహ్యాముచేసుకొని వాడవలెను.

## నాలుకపూత.

1 విరేచనములకు మందు పుచ్చుకోవలెను.

2 20 వడ్లగింజలయెత్తు మెత్తగాపొడిచేసిన పటిక

ను ఒక ఔన్సు తేనెలో కలిపి సీసాలో జాగ్రత్త చేసికొని కావలసినప్పుడెల్ల దూదెకుంచెతో ఆమందునుతీసి నాలుకకు వ్రాసేది.

3 మాఫలకాయ మంచినీటితో అరగదీసి గంధము తీసినాలుకకు వ్రాయవలెను.

---

## పుప్పిపంటికి

1 హారతికర్పూరము పుప్పిపంటిలో పెట్టవలెను.

2 ఉత్తరేణి ఆకురసములో దూదితడిపి పంటిలో నుంచవలెను.

3 దాల్చిన అరకులో దూదెతడిపి ఆదూదెపంటిగలకలో నుంచవలెను.

---

## బాలపాపచిహ్నాలు (చంటిబిడ్డగుణము)

1 ముఖముమీద చల్లనినీరు కొట్టవలెను.

2 ఒకపళ్లెములో భరించదగినంత వేడినీళ్లుపోసి అందులో రోగియొక్క పాదములుంచవలెను.

3 నవాసాగరమును, సున్నమునునూరితే నీటివలె అగును అది ఒక దూదెతో తీసి రోగికి వాసనచూపవలెను. ఆఘాటువలన తెలివిరావచ్చును.

4 తరుచుగపైకి ఎగరవైచి పట్టుకుంటూయుండేది.

5 నీరుల్లిపాయ నమలి రోగిచెవి, ముక్కులలో ఊదవలెను.

6 వెంటనేవిరేచన మయ్యేసాధిక చేయవలయును.

---

## (మలబద్ధముకాలవిరేచనమగుటకు)

---

1 తెల్లవారుజామున మంచినీరుత్రాగిపరుండవలెను.

2 ఉదయమున 1 లేక 2 మైళ్లు నడవవలెను.

3 మూలవ్యాధివున్నచో దానిని కుదుర్చుకోవలెను.

4 వేళకు భోజనము నిద్ర ఉండవలెను.

5 మలవిసర్జనము ప్రతిరోజు ఒకేవేళకుచేయవలెను. ఆసమయమునకు విరేచనము అవదనితోచినను, ప్రయత్నింపుము.

6 నారింజపండ్లరసము ఒకతులం గిద్దెడునీళ్లలో వేసి ఉదయమున ప్రతిరోజు పుచ్చుకొనుచుండవలెను.

7 ద్రాక్షపండ్లు $1\frac{1}{2}$ తులము ప్రతిరోజు రాత్రిపరుండబోవునపుడు నమలి నీళ్లుత్రాగవలెను.

8 కరకపిందెలచూర్ణము, సోపు, కలకండ। సమభాగములు చూర్ణించి జేడెత్తుమొదలు పావలాయెత్తుచూర్ణము ఉదయము సాయంత్రములయందు పుచ్చుకోవలెను.

9 ప్రతిరోజు రాత్రి పరుండబోవునప్పుడు తవుడు కొంచెము తిని నీరు త్రాగుచుండవలెను.

10 పిల్లలకుకలిగెడు మొండి మలబద్ధమునకు చేప నూనె(Cod liver oil) వాడుకచేయుట మంచిది.

---

## యెక్కిళ్లు

1 నల్లజీలకర్రచూర్ణము పంచదార వెన్నకలిపి తిన వలెను.

2 తామరగింజలు నీటిలోనూరి పంచదారకలిపి పుచ్చుకోవలెను.

---

## రొంప (పడిశము)

1 పసుపుకొమ్ముకాల్చి దాని బాగపీల్చవలయును.

2 వేడినీళ్ళలో పసుపువేసి ఆయావిరిసి ముఖము నకు పట్టవలెను.

3 మిరియములు సూదికిగుచ్చి కాల్చి పొగవాసన చూడవలెను.

4 నల్లజీలకర్ర చిన్నగుడ్డలో మూటకట్టుకొని అప్పు డప్పుడు వాసనచూడవలెను.

5 నల్లమందు ముక్కుపైన పట్టువేయువలయును.

---

## విరేచనములగుటకు

1 ఆముదము అల్లపురసం కలిపి దానిలో కొంచెము తేనెచేర్చి పుచ్చుకోవలెను. ఆముదము పుచ్చుకొన్నందువలన అసహ్యాము కలుగునుగనుక నిమ్మకాయడిప్ప నాలుకకు రాసినయెడల నాలుక యొక్క అసహ్యాముపోవును.

2 6 కరక్కాయలను నలగగొట్టి దాల్చినచెక్క చూర్ణము అరతులము నీరు అరసోలడు కలిపి 10 నిముసములు పొంగనిచ్చి వడగట్టి చల్లారబెట్టి అంతా ఒకే. సారిపుచ్చుకొంటే పెద్దవారికి 3 లేక 4 విరేచనములగును. 12 లేక 14 సంవత్సరములుగలవారికి దీనిలో సఖముగాని దానికంటె తక్కువగాని యివ్వవలయును.

---

## శెగగెడ్డలు (నెత్తురుగడ్డలు)

1 వేడినీటితో కాపడము తరుచుగా పెట్టుచుండవలెను.

2 బియ్యపుపిండి నీళ్ళతో ఉడికించి కట్టవలెను.

3 వెలిఖూడిద (కచిక) యును ఆముదమును కలిపి పట్టించవలెను.

4 చందికాంత ఆకులు ఆముదమున వెచ్చచేసి వేయవలెను.

5 మంచిగంధము హారతికర్పూరము కలిపివ్రాయవలెను.

# సర్పి

వెంటనే విరేచనములగుటకు ఆముదము అల్లపురస
ము కలిపి యివ్వవలెను.

1 సుగంధి మిరియాలు నల్లజీలకర్ర తెల్లజీలకర్ర
ఆవునేతితో కలిపి వ్రాయవలెను.

2 యెర్రసురుగుడుచెక్కయొక్క గంధము వ్రాయ
వలెను.

3 కాకిదొండాకుపసరు ఆవునేతితో కలిపి వ్రాయ
వలెను.

---

# ఆకస్మికవ్యాధులు

## రక్తముకారుట

1 గాయమున్నచోట పైకెత్తి పట్టుకొనుము ఉదా
హరణము చేతికిదెబ్బతగిలిరక్తముకారుచున్న దనుకొనుము
ఆచెయ్యి, పైకెత్తి యుంచుటవరనరక్తముకారుట కొంతమ
ట్టుకు తగ్గును.

2 రక్తముకారుచోట వ్రేలిని మోపి గట్టిగాఅణచి
యుంచవలెను లేకగుడ్డపీలికను గాయముపైనుంచి గట్టిగా
నొక్కియుంచుము నీవుఉపయోగించు చేయిగాని గుడ్డగా
ని పరిశుద్ధముగా నుండవలెను.

3 గాయము తగిలిన వాని దేహముమీదబిగువుగల దుస్తులను తీసివేయుము

4 గాయమున్న అవయవముతో పనిచేయరాదు.

5 గాయము మీదపరిశుభ్రమైన చల్లనినీరు పోయవలెను యిటులజేయుటవలన రక్తముకారుట కట్టును పెద్ద గాయములలో నీపనిచేయకుము.

## కడుపులోనుంచిరక్తముకారుట.

1 మెడమీద బిగుతుగల దుస్తులను తీసివేయుము రోగిని పరుండబెట్టి తలయెత్తయిన తలగడమీదనుంచుము

## ముక్కునుండిరక్తము కారుట

1 తలవంచి యుంచకుము తలబాగుగపైకెత్తి కూర్చుండుము

రోగి యొక్కచేతులను పైకెత్తియుంచుము ముక్కురంధ్రములయందును మెడకు వెనుక భాగమందును చల్లనినీటితో తడిపిన గుడ్డలనుంచుము.

3 ముక్కును చీదకుము.

4 పైపద్ధతులచేరక్తము కట్టనిచో ముక్కులోనికిపరిశుభ్రమైన చల్లనినీటిని పిచికారీచేయుము ముక్కుక్రింది భాగము చేతితో గట్టిగా పట్టుకొనుము.

## ముక్కులోగింజదూరుట

1 ఒకముక్కురంధ్రము మూసిరెండవముక్కు రంధ్రము చీదవలెను.

2 కొంచెము ముక్కుపొడుము పీల్చినచో తుమ్ములువచ్చి గింజబైటికివచ్చును.

---

## చెవిలోయీగగానిదోమగానిదూరుట

1 నూనె గోరువెచ్చగా కాచి పోసినచో ఊపిరిసలుపక చెవిలో నున్నయీగగాని దోమగాని బైటికివచ్చును.

2 చెవిలో చింతగింజగాని మరియేవస్తువుగాని పడి చిక్కుకొనినచో దానిని పనిముట్లతో తీయుటకు ప్రయత్నించకూడదు అట్లుచేసినయడల గూబకు హానికలుగును గనుక డాక్టరువద్దకు తీసుకొని వెళ్ళవలెను.

---

## కంటిలోనలుసు

1 కంటిలో నలుసుపడగానే దానిని నలుపకూడదు. నలిపినచో ఆనలుసు కంటికిగుచ్చుకొని బాధకలిగించును. చేతిరుమాలుతో ఆనలుసు తీయుటకు ప్రయత్నించవలెను. లేక ఆముదమును ఒకటి రెండు బొట్లను కంటియందు విడువవలెను. కనుగుడ్డు మీద కనురెప్పపైకిన్ని క్రిందకును ఆడకుండునటులచేసి డాక్టరునకు చూపుము.

కంటిలో ఆముదమువిడిచిన 3 గంటలలోగా కంటికిపుసిక ట్టిఆకల్మషము పుసిలోనుండి తొలగిపోవును.

---

## బెణుకులు

1 బెణికిన భాగమునకు విశ్రాంతినిమ్ము అచటఒక గుడ్డనువేసితరుచుగా ఆగుడ్డను చల్లనినీటిచే తడుపుచుం డవలెను.

2 ఎక్కువగా నొప్పియు వాపును కలిగియుండిన చోవేడినీటితో కాపడము తరుచుగా పెట్టుచుండవలెను

---

## మూర్ఛ

1 గాలివచ్చుచోట రోగిని వెల్లకిల పరుండబెట్టికా ళ్ళక్రింద తలగడను పెట్టవలెను

2 ముఖము మీదను చేతులమీదను చల్లనినీరుపో యవలెను.

3 ఘాటుగలవస్తువులను రోగికి వాసనచూపిన తె లివివచ్చును

4 తెలివివచ్చిన తరువాత వేడికాఫీగాని తేనీరుగా నియీయావలెను.

---

# ఎండదెబ్బ

**లక్షణములు** తలపోటు దాహము స్మృతిలేకపోవుట శరీరము వేడిగానుండుట నాడిదుడుకుగాకొట్టుకొనుట ముఖముఎర్రబడుటకు ఒకప్పుడు వాంతికూడ నుండుట యీ లక్షణములు కలిగి యుండును.

---

# చికిత్సలు

1 రోగిని నీడకు తీసుకునిరమ్ము 2 వంటిమీద నుండు బిగుతుగల దుస్తులను తీసివేయుము 3 తలక్రింద తలగడాలు పెట్టి చల్ల గాలివచ్చునటుల విసరవలెను 4 రోగికి తెలివివచ్చువరకును తల మెడ రొమ్ము వెన్నెముక చల్లనినీటిలో ముంచినగుడ్డలతో తడుపుచుండవలెను 5 రోగికి తెలివివచ్చిన తరువాత త్రాగుటకు చల్లని నీటి నియిమ్ము

---

# గుడ్డలకు నిప్పుఅంటుకొనుట

1 నీవు కట్టుకొనినబట్ట అంటుకొనినచో మోకాళ్ళ మధ్య ఆబట్టను నలిపి మంటను ఆర్పవలెను. లేదా; ఆమండేభాగమును తక్కినబట్టమడతలలోపెట్టి నలిపివేయవలెను

2 బట్ట అంటుకున్నప్పుడు పరుగెత్తకూడదు పరుగెత్తినచో గాలివలన మంటలు యెక్కువగును.

3 బట్టలకు నిప్పు అంటుకుని మంటలు లేచినచో మండుచున్నభాగము పైకియెత్తి పరుండబెట్టుము అట్లు చేసినచో మంటలు ముఖముమీదికి రావు కండ్లకు ముఖమునకు ప్రమాదము కలుగదు.

4 బట్ట అంటుకొన్నప్పుడు యెవరునులేక నీవు ఒంటరిగా నున్నచో నీపరిక్కను కంబళీగాని, దళసరిగుడ్డగాని; కోటుగాని యున్నచోటికి మెల్లగా వెళ్ళుము. ఆగుడ్డను తీసి మంటలపైని కప్పుము. అటులచేసినచో మంటలు ఆరిపోవును.

---

## నీటిప్రమాదము

ఒకమనిషి నీళ్ళలోపడి యేకారణముచేతనైనను మునిగిపోయినయెడల ఆమనిషిని వెంటనే పైకితీసి ఈక్రిందిచికిత్సలు చేయవలెను.

ఊపిరి తిరిగివచ్చేటట్టుచేయుట.

1 గాలిగొట్టములోకి స్వేచ్ఛగా వాయువును ప్రవేసింపజేయుటకు నోరు; ముక్కురంధ్రములు శుభ్రపరుచుము. యెందుచేతననగా ఆరంధ్రములయందు మన్ను మొదలగుపదాములుండియుండునుగాన వాటిని ముందుగ

తొలగించ బ్రయత్నించుము. నోరు తెరచియుండునటుల చేసి రోగియొక్క నాలుకను ముందుకులాగియుంచుము. రొమ్ముమీాదగాని మెడమీాదగాని బిగువుగానుండు బట్టలను తీసివేయుము.

2 కొన్ని నిముషముల పర్యంతము భూమి వైపున ముఖమువుండేటట్టుగా పెట్టి నుదురుక్రింద తలగడా యెత్తు పెట్టి శరీరమును త్రిప్పియుంచవలెను. అందువలన లోపలి నీరు వెలుపలికివచ్చుటకు సావుకాశముకలదు. వానిని బోరగిలపరుండబెట్టి నడుమును పైకిపట్టుకొనిన శ్వాసనాళము ఊపిరితిత్తులు వీటినుండి నీళ్ళు కారిపోవుటకై కొన్ని సెకండ్లవరకు ప్రయత్నించవలెను.

3 అటుల నీళ్ళుకారిపోయినతరువాత ముక్కువద్ద స్మెలింగుసాల్టుగాని; పొగాకుతో చేసిన నస్యపుపొడినిగాని వాసనచూపి రొమ్ము; కాళ్ళు; చేతులు వెచ్చపడునటుల రుద్దవలెను.

4 తరువాత ఊపిరివిడుచుటకు వీలుగానుండులాగున తలక్రింద తలగడలు బాగా యెత్తుగా బెట్టి వీపు వెనుకభాగముగనుండేలాగున పరుండబెట్టవలెను. తలక్రిందను భుజములక్రిందను యెత్తుగా యెత్తుపెట్టి క్రమముగా పాదములవరకు ఏటవాలుగా నుండునటుల పడక యేర్పాటుచేయవలెను.

5 రోగియొక్క మోచేతులు పైగావట్టుకొని రెక్కలను నెమ్మదిగాను చక్కగాను శ్వాసకోసములలోనికి గాని ఆకర్షించేనిమిత్తము ఆచేతులను నెత్తిపైనికలుసుకొనే లాగున మెల్లగాను లాగవలెను. యిటుల 1 నిముషమునకు 15 సారులు స్వతహాగా ఊపిరివిడుచుశక్తి కలిగేవరకు జాగ్రత్తగా చేయవలెను.

6 వేడినీళ్ళు సీసాలోపోసిశరీరమంతయుకాచవలెను యిటుకపొడుముతోడను; ఫ్లానల్‌గుడ్డతోను కడుపుయొక్క పల్లపుభాగమందు బాగుగ కాచి శరీరమందలి వేడిని వృద్ధినొందించవలెను. ఈలాగున చంకలలోను; తొడలమధ్యను; పాదములయొక్క అడుగునను కాచి ఉష్ణమును వృద్ధినొందించవలెను. ఈరోగిని పొడిగానున్న కంబళీగుడ్డలతో దట్టముగాగప్పి అంగములను చర్మమునుంచి పైకి రుద్దవలెను.

7 ప్రాణమురాగానే మింగేశక్తివచ్చినపుడు కొంచెము వేడినీళ్లు త్రాగించవలెను. తరువాత కొంతసేపటికి వేడి వేడి కాఫీ నీయవచ్చును. రోగిని గాభరాపరచగూడదు. రోగిని శాంతముగా పరుండబెట్టి నిద్రపోయేట్టు చేయవలెను.

8 నీళ్ళలో మునిగిపోయినవారికి ఊపిరిలేకపోయినంతమాత్రమున ప్రాణముపోయినట్లు యెంచకూడదు. నెమ్మ

దితోను జాగ్రత్తతోను పట్టుదలతోను ఎడతెగనిశక్తి తోను ఊపిరివచ్చునటులచేయుటకు ప్రయత్నించవలెను.

---

## పాముకాటు

పాముకరచినవెంటనే దానివిషము రక్తముతోగలసి చెడురక్తనాళములగుండా హృదయమునకుచేరి శరీరమంతయువ్యాపించును. ఇట్లువిషము శరీరమంతయు వ్యాపించుటవలన చాల అపాయము కలుగును. గనుక మనము ముఖ్యముగా గమనించవలసినదేమనగా పామువిషము గుండెకు పోకుండచేయవలెను. అట్లుచేయుటకు యీక్రింది మార్గములు అవలంభించవలెను.

1 పాము కరచినచోటికి గుండె అతిసమీపము నవిదుండువైపున, కాటుకుపైభాగమందు విషముపైకి ఎక్కకుండా, గుడ్డతోగాని, తాడుతోగాని గట్టిగాబిగించి కట్టుకట్టవలెను. ఈకట్టుసరిగా బిగియుటకొఱకుకట్టుమధ్యన కర్రఉంచి మెలిపెట్టవలెను. ఈలాగుననే మొదటికట్టుకు పైగా 4 లేక 6 అంగుళముల దూరములో రెండుమూడు కట్లు కట్టవలెను. అప్పుడు పామురచినచోట పదునుగల చాకుతోగీరవలెను. ఆగీరుభాగము పాతిగఅంగుళము లోతుగానుండి దానినుంచి రక్తము విస్తారముగా పోనియ్యవలెను.

లేనిచో కరచినభాగముచుట్టూ కోసివేయవలెను. సాధ్యమైనంతత్వరలో యీగాయము అడుగున ఎర్రగా కాలిన యినుముతోగాని, నిప్పుకణముతోగాని కాల్చవలెను. లేక కార్బాలిక్ ఆసిడ్‌తోగాని నైట్రిక్ ఆసిడ్‌తో గాని కాల్చవచ్చును.

పైనచెప్పినకాల్పు చికిత్సలు చేయుటకువీలులేనిచో పొటాసియమ్ పర్మాంగనేట్ అనుమందును పొడిచేసి పాముకాటుగలభాగమందువేసి రుద్దుము. మరియు ఆమందును వేడనీటిలో నెక్కువగాకలిపి అనీటిలో పాముకరచిన భాగమునుంచి పట్టుకొనుము. ఆమందు పామువిషమునకు విరుగుడుగా పనిచేయును.

కట్టుకట్టిన అరగంటకు విషసంబంధపు గుర్తులు అగుపడకపోయినచో ఆకట్టువిప్పివేయవలెను. లేనియెడల ఆభాగముకుళ్లి చచ్చిపోవును. విషచిహ్నాలు కనిపించినచో కట్లువిప్పరాదు.

పాముకరచినవానికి బలహీనముగా నుండునెడల కాఫీ, తేనీరు మొదలగు ఉద్రేకకరములగు పానీయముల నియ్యవలెను.

---

## పాములురాకుండచేసికొనుట

1 పాముకు కప్పలు అహారములు గనుక మన యిండ్లలోనికి కప్పలురాకుండ చూచుకొనవలెను. ఈలా

గునసే ఎలుకలున్న స్థలమందుకూడజాగ్రత్తగానుండవలెను

2 స్నానపుగదిలోనుండి నీరుపోవుతూముకు అడ్డముగా చిన్నచిన్న రంధ్రములుగల రేకును అమర్చియుంచుము. ఈలాటివే గదిగుమ్మములకుకూడ వేయించవలెను.

3 ఇంటికిదగ్గరగా తీగెలు, డొంకలు, రుప్పలు మొదలగునవి పీకించి శుభ్రముగా నుంచవలెను.

---

## వెర్రికుక్క మొదలైనవికరచుట

వెర్రికుక్క ఒకనినికరచిన పదిరోజులలోగా చనిపోయినచో నదివెర్రికుక్కయని నిర్ధారణచేయవలెను అది చావనిచో మంచికుక్కయని యనుకోవలెను. మంచికుక్కకాటు అంతప్రమాదమైనదికాదు.

వెర్రికుక్కకరచినభాగమునకుపైగా గట్టిగకట్టుకట్టి గాయమును వేడినీళ్లతో బాగాకడుగవలెను. తరువాత కార్బాలిక్ ఆసిడ్ అను ద్రావకముతో కరచినచోటపుండు చేయుము. పిమ్మట రోగిని వెర్రిజంతువులు కరచినగాయములకు వైద్యముచేసెడు ఆసుపత్రికిపంపవలెను. అచ్చట యీవ్యాధికి యింజక్షనులు చేయుదురు.

వెర్రికుక్కగాని వెర్రినక్కగాని కరచినయెడల, ఆవిషము లోనికిఎక్కుటవలన 'జలభీతి' యను నొకవ్యాధి కనిపించును.

# తేలుకుట్టుట

## చికిత్సలు

1 కుట్టినచోటుకు పై భాగమున ఒకగుడ్డపీలికతోగాని తాడుతోగాని గట్టిగబిగించి కట్టుము. పంటితోఫీకి రక్తమును తీసివేయుము.

2 నీరుల్లిపాయకోసి దానితో ఆకుట్టినచోట బాగుగా రుద్దవలయును.

3 పొగాకురసముతీసి ఆరసముతో కుట్టినస్థలమందు బాగుగా మర్దనాచేయవలెను.

---

# కొన్నివ్యాధులకు తగిన ఔషధములను తెలుపు పట్టి

ఈ మందులన్నియు చాలాభాగము "ఆంధ్రఆయుర్వేదఫార్మసీ" మదాృసులో వెలకు దొరకును.

| రోగము తెలుగుపేరు | రోగము ఇంగ్లీషుపేరు | మందుపేరు |
|---|---|---|
| అజీర్ణము | (Dyspepsia) | 1 క్రవ్యాదిరసం 2 భాస్కరలవణము |
| అతిసారము (నీళ్లవిరేచనములు) | (Diarrhoea) | 1 కర్పూరార్జరిష్టం 2 గంగాధరచూర్ణం |

అతిమూత్రము (Diabetes) 1 వసంతకుసుమాకరం 2 శత
పురకృష్ణాభ్రకం

అపస్మారము (Hysteria.) 1 కళ్యాణఘృతం 2 హింగ్వా
ష్టకచూర్ణం

ఉబ్బసము (Asthma) 1 చ్యవనప్రాశ 2 వ్యాఘ్రీహరీతకి
3 కనకాసవము

ఋతుశూల (Dysmenorrhœa) 1 హింగ్వాష్టకచూర్ణం
2 అశోకారిష్ట

కడుపునొప్పి (Colic) 1 శంకవటి 2 భాస్కరలవణం

కర్ణరోగములు (Ear, Diseases of) దత్తూరతైలం

కలరా (విషూచి) (Cholera) 1 కర్పూరార్జరిష్టం 2 అహి
ఫేనాసవము

కామిల (Jaundice) రోహితకారిష్టం

కుష్టు (Leprosy) 1 ఖదిరారిష్టము 2 మహాగంధకరసా
యనం 3 మహాపిరంగాదిలేహ్యము

గర్భాశయరోగము (Uterus, Diseases of) అశోకారిష్ట
2 లోధ్ర

గుండెరోగములు (Heart diseases) అర్జునారిష్ట

గ్రహణి (Dysentery) 1 జాతీఫలాదిచూర్ణము 2 కపి
ద్ధాష్టకచూర్ణం 3 గంగాధరచూర్ణము

చలిజ్వరము (Malaria) 1 మహాజ్వరాంకుశం 2 సుదర్శన చూర్ణము

జ్వరములు (Fevers) 1 ఆనందభైరవి 2 శీతాంసురసం 3 సన్నిపాతభైరవి

తెల్లకుసుమ (Leucorrhoea) పుష్యానుగచూర్ణం 2 అశోకారిష్ట

దగ్గు (Cough) (Bronchites) 1 వాసారిష్ట 2 చంద్రామృతరసం

నరములబలహీనత (Nervous debility) అశ్వగంధారిష్ట

నేత్రవ్యాధులు (Eye, Diseases of) 1 నారికేళాంజనం 2 నైనామృతం 3 మహాత్రిఫలాద్యఘృతం (లోపలకు సేవించేది)

పక్షవాతం (Paralysis) 1 అర్కాదితైలం 2 క్షీరబాలతైలం (పైకివ్రాయుటకు) 3 బలారిష్టము (లోపలకు పుచ్చుకొనుటకు)

పాండు (రక్తహీనత) (Anaemia) లోహాసవము

పేగు (Plague) 1 హైమాదిపానకం 2 శతధౌతఘృతం

పైత్యము (Billiousness) 1 మాత్రీఫలరసాయనం 2 ఖండార్ధ్రక లేహ్యము

బోదకాలు (Elephantisis) 1 నిత్యానందరసము

మలబద్ధము (Constipation) 1 త్రివృత్ లేహ్యము

మేహవాతనొప్పులు (Rheumatism) 1 యోగరాజగుగ్గులు 2 క్షీరబాలతైలం
మెదడువ్యాధులు (Mental diseases) బ్రహ్మీరసాయనం
వీర్యనష్టము (Spermatorrhoea) అకారకరభాదివటి
సెగ (Gonorrhoea) 1 చంగనాసవం 2 చంద్రప్రభావటి
సవాయి (Syphilis) 1 భల్లాతకరసాయనం 2 సర్వవ్యాధి హారణం 3 రసమాణిక్యం

---

## సిద్ధౌషధములు.

1 హిస్టరైన్ :—హిష్టిరియా అనగా గర్భాశయోన్మాదము, మూర్ఛ, నరముల బలహీనత, మొదలగు వ్యాధులను అమూల్యమైనది. ఒకనెలకు సరిపడు మందు డబ్బి 1కి రు 5—0—0

2 ధాతుబంద్ —శుక్లనష్టము స్వప్నస్ఖలనము నివారణయగును. వీర్యము గట్టిపడును. రతిదారుఢ్యము గలుగజేయును. వీర్యస్తంభనచేయును. ఒకనెలకుమందు రు 4—0—0

3 డెస్మొరైన్ —ఇది కఠినమైన ఋతుశూలలను పోగొట్టును. పరిశోధనలుచేసి కనిపెట్టబడినది. 15 రోజులకు సరిపడుమాత్రలు డబ్బి 1కి రు 2—0—0

4 ప్రదరాంతక్ —మూడుజాతుల కుసుమలకు,

దివ్యౌషధము, అన్ని ప్రమేహములలో కూడ పేరుపొంది నది వెల డబ్బీ 1కి రు 5—0—0 (1 తులముమందు)

5 గర్భస్రావనివారిణి—గర్భస్రావమునిలిపి సత్సంతానము గలుగజేయును. వంధ్యాదోషములను పోగొట్టి గర్భధారణకలుగజేయును.

వెల 1తులముమందు రు 5—0—0

6 పార్శ్వపుతలనొప్పిమాత్రిలు — పార్శ్వపుతల నొప్పి దీనిని 7 దినములు సేవించుటవలన మరలతిరిగిఎన్నటికిని రాదు. నిస్సంశయముగాకుదురును. 15 మాత్రిలు గలడబ్బీ 1కి రు 2—0—0 .

7 డైజెస్టు —పైత్యము అజీర్తి మలబద్ధము దీనిని సేవించుటవలన పోవును. బాలురు, వృద్ధులు, నిర్భయముగా సేవించవచ్చును. తత్వము మార్చి మలబద్ధము తొలగించుటలో నిది ఘనత కెక్కినది. వెల డబ్బీ 1కి రు 2—0—0

8 కామవర్ధనీ — నపుంసకత్వము, శుక్లనష్టము నరముల బలహీనత. నిస్సత్తువ హరించును. రక్తశుద్ధి చేయును. శరీరమాంసమును వృద్ధిచేయును. బలమైన ఆహారము. వెల డబ్బీ 1కి రు 4—0—0

యోగ్యతాపత్రికలకు వ్రాయుడు.

వీటన్నింటికి పోష్టు, రిజస్ట్రేషన్ ప్యాకింగు ఖర్చులువేరు.

డాక్టరు కె. బి. శర్మ,
పాలమూరు. పశ్చిమగోదావరిజిల్లా.

# సుప్రసిద్ధవైద్యగ్రంథములు

1 ఓషధీగుణపంచభాషి—ఈపుస్తకములో సుమారు 800 వనమూలికలపేర్లు 5 భాషలలో వ్రాయుటయేగాక వాట్లసిద్ధగుణములు వాటిని సేవించుటవలన కలిగినవికార మునకు శాంతులు అలభ్యప్రతినిధివస్తువులు, ప్రతినామములు మూలికలలోనుండు ప్రాముఖ్యమైన పదార్థము (Active principle) మొదలగునవి పెక్కుశాస్త్రములు పరిశీలించి వ్రాయబడినవి వెలప్రతి 1కి రు1-0-0

2 ఆసవారిష్టదీపిక—దీనిలో ఆసవములు అరిష్టలు, చేయు విధము పఖ్యలముగా అనేకశాస్త్రములు పరిశీలించు వ్రాయబడినది వెల ప్రతి1కి రు 0-8-0

3 ఆంగ్లేయవైద్యరహస్యము :— ప్రతికుటుంబకు మును, ప్రతిపల్లెటూరివైద్యునను, యింగ్లీషువైద్యము సులభముగా దనివలన చేసికొనవచ్చును.

వెల ప్రతి 1కి 0—8—0

4 తెలుగు మడికల్ హాండుబుక్కు— యిందునిత్యకృత్య ములో నింటిలోనుపయోగించుకొను ఔషధములు అనగా ఆముదభేదిపకి తాంశురసము సన్నపాతిభేదిపి లక్ష్మీపిలా

సరసం గ్రహణికవాటం పరితాపలంకేశ్వరం మొదలగు మందులు చేయువిధము శుద్ధులు ప్రతివానికి తెలిసేటట్లు చక్కగా వ్రాయబడినవి.

వెల ప్రతి 1కి రు_04_0

వీట్లన్నింటికి పోస్టుపాక్యకింగువగైరాఖర్చులువేరు

పాలమూరు. డాక్టరు కె. బి. శర్మ

1-8-1928 పాలమూరుపశ్చిమగోదావరిజిల్లా

# పీఠిక

—:o:—

తెలుగు మెడికల్ హాండుబుక్కు మొదటికూర్పు 1902 సం॥లోను రెండవకూర్పు 1903 సం॥లోను మా తండ్రిగారగు కొత్తపల్లి నరశింహముగారిచే ప్రకటింపబడెను ఆ ప్రతులన్నియు త్వరలోనే ఖర్చుపడినవి. దరిమిలాను అనేకులు సదరు గ్రంధములకొఱకు వ్రాయుచున్నందున సదరు గ్రంధమును మా తండ్రిగారిచేత పరిష్కరింపించి యీ మూడవకూర్పు నేను ప్రకటించడమైనది. గాన యిందులదోషంబులు క్షమింతురుగాత.

పాలమూరు
1—8—1928 } డాక్టర్ కె. బి. శర్మ.

## 1 ఆనందభైరవి

ఇంగిలీకము, నాభి త్రికటుగములు (అనగా శొంఠి పిప్పలి, మిరియాలు) వెలిగారము పిప్పళ్ళు వీటిని శుద్ధులుచేసిసమభాగములుగ ఖల్వమందుంచి, మాధీఫలమురసముచే బాగుగమర్దించవలెను. దీనిని జ్వరములలో గుంజాపరిమాణముమాత్రి వాడుదురు. గ్రిహణ్యతిసారాదులలో దీనికి కొద్దిగా నల్లమందుచేర్చి వైద్యు లుపయోగించుచున్నారు. కొందరు వైద్యులు మాధీఫలరసముకుబదులుగా నిమ్మపండ్లరసముచే నూరి పైమందు తయారుచేయుచున్నారు.

## 2 శీతాంశురసము

మణిశిల, తాళకము యివి దినుసుకొక్కొక్కభాగము. త్రికటుకములు అనగా శొంఠి పిప్పలి మిరియాలు మూడునుకలిసి రెండుభాగములు వేపచెక్కరసముతో బాగుగ మర్దించవలెను. దీనిని చాలామంది వైద్యులు నిమ్మపండ్లరసముతో మాత్రము మర్దనాచేసి వాడుచున్నారు. దీనిని శీతజ్వరములలో వివిధములగు అనుపానములచే వాడవచ్చును.

## 3 సన్నిపాతభైరవి

తాళకము, గంధకము, పాదరసము యివిసమభాగములు; వీట్లకు సమము నాభి, మణిశిల, వెలిగారము యివి తాళకముతో సమభాగములుగ వేసేది, వీటినన్నిటికి సమము యింగిలీకముచేర్చవలెను. చిత్రమూలమ్ము, అల్లము, నిమ్మపండ్లు వీటిరసములచే, ఒక్కొక్కరసము చేత ఒక్కొక్కరోజు చొ॥ మూడురోజులు మర్దించవలెను. అనుపానభేదములచే అన్నివిధములైన సన్నిపాతములలోను వాడవచ్చును.

## 4 సింహప్రతిపాలనం

పాదరసం, గంధకం, నాభి, గరళం యివి సమభాగములు తెచ్చి హంసపాదియాకురసముతో బాగుగ మర్దించి ఆవాలవలె మాత్రలు చేయవలెను. ఇది సర్వజ్వరములలోను వాడుదురు. రోగికి తత్వమునుబట్టి శీతలోపచారములు చేయవచ్చును. కొందరు వైద్యులు ఈ మాత్రలను వాడుతూ, పెరుగుఅన్నము పెట్టించుచుందురు.

## 5 పైత్యాంతకము

అల్లము, జీలకర్ర, ఉసిరికపప్పు, లవంగములు, సైంధలవణ్ణం, రససింధూరం, తాళిసపత్రి, తవాక్షురి, యివి సమభాగములుగ చేర్చి నిమ్మపండ్లరసముతో 3 రోజులు బాగుగ మర్దించవలెను. దీనివలన, ఆమ్లపైత్యాదులు కుదురును. మాత్రి మోతాదు శనగగింజంత వాడవచ్చును.

## 6 హుతాశనరసం

గంధకము, 1 భా. వెలిగారం, 1 భా. నాభి, 2 భా కపర్ది, 3 భా. శంఖభస్మం, 3 భా. మిరియాలు, 8 భా. నిమ్మపండ్లరసముతో మర్దనాచేయవలెను. దీనివలన అజీర్ణములు హరియించి ఆకలిపుట్టించును.

## 7 వాతగజాంకుశము

పాదరసం 8 భా. ముషిణివిత్తులు 8 భా. గంధకం 3 భా. త్రికటుకము 3 భా. త్రిఫలములు 3 భా. నిమ్మపండ్లరసముతో మర్దించి గురుగింజపరిమాణం మాత్రలుచేసి పూటకు మూడుమాత్రలు చొ॥ నెయ్యిమిరియాలచూర్ణం

అనుపానముతో సేవించిన వూరుస్తంభవాతము మొదలగు అన్నివిధములయిన వాతములును కుదురును.

---

## 8 స్వచ్ఛన్నము.

---

పాదరసం, నాభి, గంధకం, మూడును సమభాగములు. జాజికాయులు పాదరసంలో సగభాగం వేయవలెను. వీటి అన్నిటికిని సగము పిప్పళ్ళు యివి తమలపాకులరసముచే బాగుగ మర్దించవలెను. చంటిబిడ్డల అజీర్ణములు, వాతములు, జ్వరములు కుదురును.

---

## 9 కనకసుందరరసం.

---

ఇంగిలీకం, మిరియాలు, గంధకం, పిప్పళ్ళు, వెలిగారం. నాభి, నల్లఉమ్మెత్తవిత్తులు యివి సమభాగములు తెచ్చి గంజాయిఆకురసముతో ఒకఝూము మర్దించి శనగగింజంత మాత్రలుచేసుకోవలెను. దీనివలన జ్వరాతిసారములు, గ్రిహణులు నివర్తించును. మజ్జిగఅన్నము భుజించుట పథ్యకరము.

---

## 10 లఘుక్రవ్యాది.

పాదరసం 1 భా. గంధకం 2 భా. లోహభస్మం అరభాగం, పిప్పలి, పిప్పలిమూలం, చిత్రిమూలం, శొంఠి, లవంగాలు యివి ప్రత్యేకము అరభాగం చొ॥ చేర్చవలెను. సౌవర్చలవణం 1 భా. వెలిగారం 2 భా. మిరియాలు 2 భా. వీటిని చూర్ణించి నిమ్మ, మాదీఫలం, దబ్బ, దానిమ్మరసములచే బాగుగ మర్దించవలెను. దీనిని మజ్జిగతో సేవించినచో సర్వాజీర్ణములు హరించి అగ్నిదీప్తి కలుగును.

## 11 ఇచ్ఛాభేదిరసం.

పాదరసము, గంధకం, వెలిగారం; శొంఠి, మిరియాలు యివి సమభాగములు నేపాళములు 3 భా. యివి చక్కగా మర్దనాచేసి రెండు గురివింజగింజలంత యెత్తుగల మాత్రలుచేసి సీటితో సేవించిన సుఖవిరేచనమగును.

## 12 శూలకుటారం

వెలిగారం 1 భా పాదరసం 1 భా గంధకం 1 భా కరకతాడియుసిరికలు ఈమూడునుకలిసి 1 భా. శొంఠి పిప్ప

లిమిరియాలు ఈమూడున్నుకలిసి 1 భా తాళకం 1 భా నాభి 1 భా తామ్రభస్మం 1 భా నేపాళములు 1భా యివి సమభాగములుగ్రహించి ఖల్వమందుంచి గుంటకలగర ఆకురసమున మర్దించి రెండుగుంజలంతమాత్రలుచేసి ఒక మాత్ర మిరియాలు అల్లపురసముతోనిచ్చిన సర్వశూల లు నివారించును.

---

## 13 జ్వరధూమకేతు

---

పాదరసం గంధకం ఇంగిలీకం సముద్రఫునురుగు యివి సమభాగములు అల్లపురసముచేత 2 ఝాములు మర్దించవలెను. అల్లపురసముతో 3 రోజులు సేవించిన నవ జ్వరములు కుదురును.

---

## 14 మహాజ్వరాంకుశం

---

పాదరసం 1 భా నాభి 1 భా గంధకం 1 భా నల్ల ఉమ్మెత్తగింజలు 3 భా శొంఠి 4 భా పిప్పళ్ళు 4 భా మిరియాలు 4 భా నిమ్మపండ్లరసముతోను అల్లపురసముతోను బాగుగమర్దించి రెండుగుంజలంతమాత్ర సేవించవలెను. అన్నివిధములయిన ఆహికజ్వరములు కుదురును.

---

## 15 క్రిమిముద్గరసం

పాదరసం 1 భా గంధకం 2 భా వాము 3 భా వాయువిడంగములు 4 భా విషముష్టివిత్తులు 5 భా మోదుగమాడలు 6 భా వీటిని చూర్ణించి నిష్కపరిమాణం తేనెతో పుచ్చుకొన్నపిదప తుంగముస్తల కషాయం పుచ్చుకొనిన క్రిములు హరించును.

---

## 16 సింధూరభూషణం

---

అభ్రకభస్మం 1 భా రససింధూరం1భా గంధకం 1భా వెలిగారం 1భా యివిన్నల్లపుమ్మెత్తాకురసముచేమర్దించవలెను. ఇది గర్భిణీస్త్రీలజ్వరములు వగయిరాలకు మిక్కిలి మంచిగ ఇది రేవణసిద్ధుని యోగము.

---

## 17 గ్రహణికవాటం

---

పాదరసం జాజికాయ శొంఠి పిప్పలి మిరియాలు నాభి గంధకం వీటిని సమభాగములుగచేర్చి గంజాయిఆకు కషాయమున మర్దించవలెను. అనుపానవిశేషముచే అన్ని విధములైన గ్రహణులలోను పనిచేయును.

---

## 18 పంచవక్త్రరసం

పాదరసం 1 భా గంధకం 1 భా వెలిగారం 1 భా మిరియాలు 1 భానల్లవుమ్మెత్తాకురసమున మర్దనాచేయవలెను అన్నివిధములైన జ్వరములు కుదురును.

## 19 జ్వరహారి

కటకరోహిణి మిరియాలు రససింధూరం నాభి ఇవి సమభాగములుగ తెచ్చి గుంటకలగరఆకురసాన బాగుగమర్దించవలెను. అన్నివిధములయిన సామాన్యజ్వరములు కుదురును.

## 20 కాలకూటరసం

నాభి 11 భా పాదరసం 3 భా గంధకం 5 భా మణిశిల 6 భా తామ్రభస్మం 4 భా వెలిగారం 6 భా తాళకం 9 భా చిత్రమూలం 9 భా కరకతాడివుసిరికలు ఈ మూడున్ను కలిసి 10 భా శొంఠి పిప్పలిమిరియాలు ఈ మూడున్ను కలిసి 12భా ఇంగువ 1 భా వస 1 భా ఉప్పుకారం ఖల్వమందుచేర్చి 1 అల్లము 2 చిత్రమూలం 3 నిమ్మపండు 4 వెల్లుల్లి 5 గురివిందచెక్క 6 కాగమునగ 7

తెల్లజిల్లేడువేరు 8 చెన్నచెర్లగడ్డ 9 హంసపాదిఆకు 10 వావిలాకు 11 తమలపాకు 12 ఊడుగచెక్క 13 మునగ వేరు ఈ రసములచేత ప్రత్యేకము రసమున కొకరోజాము చొప్పున మర్దనాచేయవలెను, తరువాత పంచకోలకషాయ ముతో ఒకరోజునను పంచమూలకషాయముతో మరియొ కరోజునను బాగుగ మర్దించవలెను, మాత్రపరిమాణం గుంజామాత్రగాచేసి అనుపానములతో వాడిన అన్నివిధము లగు దారుణవాతములును హరించును.

## 21 మృత్యుంజయరసము

నాభి 1 భా మిరియాలు 1 భా పిప్పలి 1 భా మో డి 1 భా గంధకం 1 భా వెలిగారం 1భా యింగిలీకం 2 భా వీటిని ఖల్వమందుంచి నిమ్మపండ్లరసముతో బాగుగ నూరి పెసరగింజంతమాత్రలు చేయవలెను. ఘోరమైన నవ జ్వరములు అనుపానవిశేషముతో కుదురును.

## 22 వాతవిధ్వంసి

పాదరసం 1 భా గంధకం 1 భా సీసభస్మం 1 భా వంగభస్మం 1 భా లోహభస్మం 1 భా తామ్రభస్మం 1

భా అభ్రికభస్మం 1భా శొంఠి 1భా పిప్పలి 1భా మిరియాలు 1 భా వెలిగారం 1 భా నాభి 4½ భా చో॥ చేర్చి త్రిఫల కషాయముతో 3 రోజులును నేలతాడిగడ్డలు చిత్రమూలం గుంటకలగరఆకు చంగల్వకోష్ఠు వీటిరసములచే 3 సార్లును వావిలియాకు అల్లము అడ్డసరము గంజాయిఆకు నిమ్మరసం డ్లొరసము ఈ రసములన్నిటిచేతను వేరువేరుగ బాగుగ నూరవలెను, యిది సూతికావాతముల మీదకూడా బాగు గ పనిచేయును.

## 23 లఘుసూర్యావర్తి

అభ్రికభస్మం హేమాక్షికభస్మం పైడిపత్తిగింజల లోనిపప్పు వెలిగారం ముత్యపుచిప్పలభస్మం తిప్పసత్తు కాకిదొండపిత్తులలోనిపప్పు లవంగాలు యివి సమభాగము లు వీటిఅన్నిటికిని సమభాగం ఇంగిలీకంవేసి నిమ్మ దాని మ్మ పెద్దవుసిరిక మాదీఫలం నారింజ దబ్బ యీ ఫలరస ములచేతను అల్లము పులిచంచలి,జీలకర్రి పచ్చిద్రాక్షయీ రసములచేతను వేరువేరుగా రసము ఒక్కంటికి ఒకరోజుచొ ప్పున బాగుగ మర్దించవలెను. పైడిపత్తిపువ్వుయొక్క రస ముచేతను కొందరు మర్దనాచేయుచున్నారు. అన్నివిధము లయిన చర్దులు జ్వరములు చక్కగా కుదురును. అనుభవ సీయమైనది.

# 24 మాల్యవంతరసం.

పాలతుత్తం 2 భా మిరియాలు 1 భా వేపచెక్క రసానమర్దించేది పెసరగింజంత మాత్రిలు వాడవలెను. కఠినజ్వరములు అద్భుతముగ కుదురును.

# 25 మృతసంజీవినీరసం.

ఇంగిలీకం 4 తు నాభి 2 తు వెలిగారం తు1 నే పాళాలు తు 1 అల్లపురసంతో రెండు ఝాములు బాగుగ మర్దనా చేయవలెను.

# 26 ప్రితాపలంకేశ్వరం.

పాదరసం 1భా అభ్రికభస్మం 1 భా గంధకం1భా లోహభస్మం 2 భా అప్పుడుపుట్టిన ఆవుదూడ రేణంకా ల్చిన మసి 3 భా మిరియాలు 3 భా నాభి 8 భా శంఖభస్మం 8 భా వీటిని వావిలాకురసముతో మర్దించవలెను. సమస్తవాతజ్వరములు సన్నిపాతములమీద వాడవచ్చును.

## 27 కస్తూరిభైరవం

నాభి, కస్తూరి, జున్ను, పావుదాసు గోరోజనం కుంకుమపువ్వు మిరియాలు యివిసమభాగములు తెచ్చి చిత్రిమూలరసంతో 3 రోజులుచక్కగా మర్దించి గుంజాప్రిమాణం మాత్రిలుచేసి కార్కుగల సీసాలో వేయవలెను. యీమాత్రిలకు వెండిగున్నారేకు చుట్టినచో ఘాటుపోకుండాయుండును. యిదిచంటిపిల్లల వాతవ్యాధులకు మిక్కిలి మంచి మందు,

## 28 లఘుచంద్రోదయం

అభ్రికభస్మం, పాదరసం, వంగభస్మం, ఏలకులు, శిలాజిత్ భస్మ్గా యివిసమభాగములు తెచ్చి, అరటిదుంపరసముచే మర్దించవలెను. అనుపానవిశేషముతో సేవించిన సమస్తప్రిమేహములు కుదురును.

## 29 భేదిజ్వరాంకుశం

పాదరసం 1 భా నాభి 1 భా గంధకం 2 భా వెలిగారం 2 భా మిరియాలు 5భా నేపాళాలు 6 భా రెండు

జాములు ములకపండ్లరసము (అనగా పాకుడు) చేమర్దించవ లెను. గుంజాపరిమాణం మాత్రను అల్లపురసముతో సే వించిన మలబద్ధము నివారించును జ్వరములు హరించును.

## 30 రాజచంద్రేశ్వరి

పాదరసం, గంధకం. నాభి, తామ్రభస్మం యివిస మభాగములుగాచేర్చి చిత్రమూలరసముచే ఒకదినముమర్దిం చవలెను. అల్లపురసముతో ఒకమాత్ర సేవించిన, మొండి జ్వరములు హరించును=ఈమందువాడుచు అవసరమునుబ ట్టి రోగికి శీతలోపచారములు చేయవచ్చును.

## 31 తరుణార్కం

గంధకం, వెలిగారం, అభ్రకభస్మం, నాభి, నల్ల ఉమ్మెత్తవిత్తులు గరళము (అనగా త్రాచుపామువిషము) రక్తచందనము, వంగభస్మం, యివిసమభాగములు, వీటిక న్నిటికిని సమము యింగిలీకం చేర్చవలెను. మాదీఫలరస ముచే మూడుదినములు బాగుగమర్దనాచేయవలెను అను పానవిశేషములతో వాడిన అద్భుతముగు జ్వరములు హరించును.

## 32 విషమసూచికారసం

పాదరసం, నాభి, గరళం యివిసమభాగములు నల్లఉమ్మెత్తాకురసమున బాగుగమర్దించవలెను. 4 ఝాములుమర్దనాచేసి ఆవాలంతేసి మాత్రలుకట్టవలెను తీవ్రమైన వాతజ్వరములు సూతికావాతజ్వరములు కుదురును.

## 33 మేహాంతకము

కాంతభస్మం తు 1 వంగభస్మం 1 తు అభ్రకం తు 1 కర్పూరశిలాజిత్ 4 తు యివికలబందరసాన మర్దించవలెను, వెన్న పంచదార అనుపానములతో సేవించిన మేహములు మేహజ్వరములు కుదురును.

## 34 కఫకేతు

వెలిగారం, శంఖభస్మం, శొంఠి, పిప్పలి, మిరియాను, నాభి, యివి సమభాగములు తెచ్చి, అల్లపురసముతో బాగుగ నూరికుప్పెలు కట్టవలెను. వాతముతో కూడుకొన్న శ్లేష్మవ్యాధులలో, అనుపానవిశేషములచేత యీమందు కఫమును నివారణచేయును. తులశియాకురసం ఆకుచెముడురసం, తేనె, దుంపరాష్ట్రం యీమొదలగు అనుపాన

ములచేత, ఈమందు వాడినచో ప్రత్యక్షఫలితము కనుపడును.

## 35 ఆమవాతవిధ్వంసి

పాదరసం 1 తులం గంధకం 1 తులం నాభి తు 4 యివి చిత్రమూలరసంతో మర్దించవలెను.

## 36 శీతాంకుశము

తాళకం తు 1 మణిశిల తు 1 శొంఠి తు 1 పిప్పలి తు 1 మిరియాలు 1 తు యివి నిమ్మపండ్లరసాన 12 ఝాములుమర్ధించవలెను. యిదిన్నీ శీతాంశురసము మాదిరిగా పనిచేయగలదు.

## 37 శూలగజకేసరి

పాదరసం, గంధకం నాభి. వరాటభస్మం, వెలిగారం, సైంధలవణం శొంఠి పిప్పలి యివిసమభాగములు తెచ్చి తమలపాకుల రసముతో మర్దనాచేయవలెను అనుపానములచే అన్నివిధములైన శూలల మీదను వాడవచ్చును.

## 38 లఘుచింతామణి

పాదరసం, గంధకం నాభి, తాళకం, నేపాళం వె లిగారం, మిరియాలు యివి సమభాగములు నిమ్మపండ్లరస ముతో బాగుగ ఒకరోజు మర్దించవలెను. ఈమందు అన్ని విధములయిన శూలలమీద వాడుటకు పనికివచ్చును.

## 39 రసవంగము

పాదరసం 1 భా తగరపురేకులు 2 భా. తగరపురే కులను కరగించి పాదరసమునచేర్చవలెను. యీమందును వంగభస్మము కర్పూరశిలాజిత్ భస్మము వెన్న పంచదా రమొదలగు అనుపానములతో సేవించిన మేహవ్యాధులు కుదురును.

## 40 బృహత్సూతివినోదరసము

శొంఠి 1 భా మిరియాలు 2 భా పిప్పలి 3 భా పా రదలవణము ½ భా జాజిమొగ్గలు 2 భా శుద్ధిచేసిన మైల తుత్తం 2 భా యివి ఖల్వమునయంచి వావిలాకురసముతో ఒకఝామువర్దించి మాత్రిలుచేసి తేనెతో సేవించిన సూ తికారోగము హరించును

పారదలవణము అనగా శాకంబరీలవణము=హిందీ 1 నమ్మక్ సాంబర్= 2 సాబర్ నోన్ అనగా శాంబరలవణము; జాజిమొగ్గలు=జాపత్రి)

# వంటౌషధములు

## పుటయోగములు

## 41 వంగరాజీయము

పాదరసం 1భా తగరంరేకులు 3భా గంధకం 3భా తగరపురేకులనుకరగించి అందులో పాదరసముచేర్చవలెను తరువాత గంధకమును కలిపి నూరవలయును. కలుబందరసముతోనొకదినము బాగుగామర్దించి మాత్రలుగజేసి నీడను ఆరించి గాజుకుప్పెలోనుంచి వాలుకాయంత్రమున 12 ఝాములు వండవలెను.ఇదివంటచేయుట తెలిసినవారిదగ్గర తెలిసికోవలెను. అనుపానవిశేషములతో వాడిన పురాణజ్వరములు మేహజ్వరములు చక్కగా కుదురును. కొందరు తగరపురేకులకు మారుగా వంగభస్మమును చేర్చుచున్నారు.

## 42 రజితలోహరసాయనం

పాదరసం 1 భా గంధకం 2 భా లోహభస్మం 3 భా (లేక పుక్కురావడి) వెండిభస్మం 1 భా (లేక ఖాదీ

వెండియొక్కరజను) యివి కల్వములోనుంచి కలబంద తెల్లగజ్జేరు నల్లేరు చిత్రమూలం అల్లం సంబరేణుఆకు గుంటకలగర వీటిలో ఒకొకరసముచే ఒక్కొక్కరోజు మర్దించవలెను. రేగుగింజంతమాత్రలుచేసి నీడను ఆరించి గాజుకుప్పెలోపోసి వాలుకాయంత్రమున 2 ఝాములువండలెను. సాంగశీతలమున దీసి మరలపైజెప్పిన రసములచే ఒకొకదానిచే ఒకొక్కరోజున బాగుగామర్ధించవలెను. అనుపానవిశేషములతో సేవించిన పాండువులు కామిలలు క్షయలు ఉబ్బులు ఉబ్బసములు యివికుదురును. దీనిని వంటచేయక మూకుడులోపెట్టి శీలమన్నుయిచ్చి పుటయోగముగా తయారుచేయుచున్నారు.

---

## 43 రసరాట్

ఇంగిలీకం పాదరసం రససింధూరం రశకర్పూరం వుక్కురావడి (అనగా ఆకురాయితో రాసినరజను) యివి అల్లపురసముతో నూరి బిళ్ళచేసి మూకుడులోపెట్టి పుటము వేయవలయును. మిరియాలరసముతో కుప్పెలుకట్టుదురు. దీనిని కొందరు కాశీకుప్పెలోపెట్టి వాలుకాయంత్రమునకూడ వండెదరు. దుంపరాష్ట్రం లవంగాలు కరక్కాయ తేనె అనుపానములతో వాడిన దగ్గులు శ్లేష్మజ్వరములు కుదురును.

---

# 44 రసభూపతి

పాదరసం నాభి గంధకం లోహభస్మం తామ్రభస్మం యివి సమభాగములు తెచ్చి హంసపాదియాకురసముతో మర్దించవలెను. వాలుకాయంత్రమున 12 ఝాములు వండుచున్నారు. కొందరు పుటయోగము చేయుచున్నారు అనుపానభేదములచే పాండువులు కామిలలు జ్వరములు శ్లేష్మములు చక్కగాకుదుకును.

# 45 హేమసుందరరసం

లేక

సువర్ణపుష్పరసాయనం

తగరపురేకు 2 భా పాదరసం 2 భా నవాసాగరం 2 భా. గంధకం తగరపురేకులను కరిగించి పాదరసమును అందులో చేర్చవలెను తరువాత గంధకము నవాసాగరము చేర్చినూరవలెను. మూకుడులోపెట్టి పైనిమూకుడుమూసి శీలమన్ను యిచ్చి పైమూకుడుకు సన్ననిరంధ్రముచేసి పొయ్యిమీదపెట్టి వండవలెను. ఆరంధ్రములోనుంచి యినుప సలాకువేయుచు చూచుచుండిన బంగారువర్ణముగా ఖడ్డీకి అంటుకొనును. ఆతరుణము చూచిదించుకోవలెను. చల్లారినతరువాత కలబందరసముతో నూరవలెను. నెయ్యి వెన్న

పంచదార జీలకర్ర మొదలగు అనుపానములచే సేవించిన సమస్తప్రమేహములుకుదురును. యిదితయారుచేయుటలో చాలా అనుభవముండవలయును లేనియెడల మందువృధాగా మాడిపోయి చెడిపోవును.

## 46 లోహరసాయనం

పాదరసం నాభి గంధకం తామ్రం లోహం వరాటం త్రికటుకములు యివి సమభాగములుచేర్చవలెను. తెల్లగజ్జేరు నల్లేరు రసములచే మర్దించి మూకుడులోపెట్టి కుక్కుటపుటము పెట్టవలెను. సదరు రసములచేతనే తిరుగనూరి కుప్పెలు కట్టవలెను.

అనుపానములచేత—శ్లేష్మవ్యాధులు దగ్గులు జ్వరములు కుదురును.

## 47 లఘులక్ష్మీవిలాసరసం

ఇంగిలీకమును తెచ్చి కోడిగుడ్లలో నిసానచేత మెత్తగానూరి కోడిగుడ్డు డొలకలలో పెట్టి పల్చని గుడ్డనుమూటగట్టి సున్నపునీళ్ళచే డోలాయంత్రమున 4 ఝాములు వండవలెను. తరువాత కలబందరసముచేత మర్దించి కుప్పెలు కట్టవలెను. నీడను ఆరించవలెను. అనుపానవిశేషములతో

వాడిన చంటిపిల్లల ఉడుకులు జ్వరములు వాంతులు వగై రాలు చక్కగాకుదురును. యిది అనుభూతయోగము.

## 48 బాలసూర్యోదయము

పాదరసం గంధకం నాగభస్మం వంగభస్మం లోహభస్మం తామ్రిభస్మం అభ్రికభస్మం యివిసమభాగములు వీటిఅన్నిటికిని సమము యింగిలీకము వేసి శేకుఆకురసములో బాగుగ మూడురోజులు మర్దించి కాశీకుప్పెలో వేసి వాలుకాయంత్రిమున 12 ఝాములు వండవలెను. పురాణ జ్వరములు మేహజ్వరములు యితరజ్వరములు చక్కగా కుదురును.

## 49 షడ్గుణసింధూరం

పాదరసం 1 భా అమరశిలగంధకం 6 భా యివికల్వములోనుంచి, బాగుగా మర్దించవలెను. గాజుకుప్పెలోపోశి వాలుకాయంత్రిమున 24 ఝాములు మృదుతీక్ష్ణగాఢాగ్నులచేవండిన యర్రిగా సింధూరించును. యిది క్షయలు పాండువులు జ్వరములు పైత్యములు మేహములు కుదురును.

## 50 లోకనాథరసం

పాదరసం నాభి గంధకం తామ్రం లోహం వరాటం త్రికటుకములు యివి సమభాగములు తెచ్చి తెల్లగల్జేరు నల్లేరు రసములచే మర్దించవలెను. కుక్కుటఫుటము వేయవలయును.

## 51 వాతరాక్షసం (ఫుటయోగము)

రజితము రససింధూరము అభ్రకం లోహం కాంతం సువర్ణం తామ్రం గంధకం నాభి యివి సమభాగములు తెచ్చి తెల్లగల్జేరు అల్లము తులసి చిత్రమూలము వీటిచేమర్దించిమూకుటిలోపెట్టి కుక్కుటఫుటము వేయవలయును సాంగశీతలమునదీసి అల్లపు రసముతో కుప్పెలుకట్టవలెను. అనుపానవిశేషముతో అన్నివాతములలోను వాడవచ్చును.

సంపూర్ణము.

N. B. వంట ఔషధములన్నియు, తూర్పుగోదావరిజిల్లా, పెద్దాపురం తాలూకాలోని జగ్గంపేట, అనేగ్రామములోని, వారలువైద్యులు వంటౌషధములు తయారు చేయుటలో ప్రఖ్యాతికెక్కియున్నారు. వారినిగప్పించి వంటౌషధములను తయారుచేయించుకొనిన ప్రశస్తముగా తయారుఅగును.

# జ్ఞాపిక

1 అన్నిమందులలోను చేరెడివస్తువులు క్రొత్తవిగాను, పరిశుభ్రమైనవిగాను చూచి చేర్చవలెను. పాతవస్తువులు నిస్సారమైనట్టియు పుచ్చిపోయినట్టియు మూలికలను చేర్చరాదు—

2 వస్తువులన్నియు, బాగుగ పరిశీలించి బాగుచేయించి ఎండించి వేరుగచూర్ణములుచేయించి, వస్త్రగాళితము చేయవలసినవి చేయించిన చూర్ణములు భాగముల ప్రకారము మందులలోచేర్చవలెను లేనియడల, భాగములలో తేడాలుకలిగి, మందులు సరిగాపని చేయకపోవును—

3 ప్రతివస్తువును యీగ్రంథములో చెప్పిన ప్రకారం శుద్ధిఅతిశ్రద్ధతో చేసుకోవలయును. సంశయములు కలిగినచో సద్వైద్యులనడిగి తెలిసికోవలయును. శుద్దిసరిగా చేయకుండా యేవస్తువును మందులలో చేర్చరాదు—శుద్ధులు వ్రాయనివాటికి శుద్ధులుచేసుకోనక్కరలేదని గ్రహించుకోవలెను—

4 శుద్ధులు భస్మములుచేయుటలో అనేకగ్రంథములలో అనేక సాంప్రదాయప్రకారములుగా వేరువేరు పద్ధతులుగా వ్రాయబడియున్నవి. అవి దేశసాంప్రదాయ ప్రకారము చేయతగినది గనుక ఈగ్రంథములో సాధ్యమైనం

తవరకు విరళముగవ్రాయబడినవి అయినను సద్వైద్యుల దగ్గర చూచినేర్చుకోవలశియున్నవి. గంధ్రిములో వ్రాశి నంతమాత్రాన బోధపడుట మిక్కిలికష్టము—

5 మాత్రపరిమాణము వ్రాయనిచోట గురివిందంత పరిమాణమని గ్రహించుకోవలెను—

6 **అనుపానములు** శీత పైత్య జ్వరములకు, అల్లపురసం; వాతములకు మిరియాలరసం, తులశి యాకురసం, తమలపాకురసం; క్రిమివాతములకు వాయువిడంగములరసం, దానిమ్మపట్టకషాయం; అజీర్ణాదులకు, శొంఠి, వాము, రసములు; తాపజ్వరములకు ధనియాలు, వట్టివేరు, రక్తచందనం వీటికషాయములు. ప్రమేహములకు, పచ్చకర్పూరం, చలవమిరియాలు, పన్నీరు, మంచిగంధం పొట్టు, చందినీ అత్తరు మొదలగు అనుపానవస్తువులు బుద్ధిచేత నిర్ణయించుకోవలెను—

7 ఖజలీమందులు ఆరుమాసముల వరకు బాగుగ బనిచేయును—వంటపుఔషధములు నిలవవున్నకొలదియు మంచిగుణములనిచ్చును—

8 **పథ్యములు** ఈమందులు వాడునపుడు అజీర్ణము, పైత్యము హెచ్చుచేయు విపరీతపదార్థములు, కారము పులుసు, పదార్థములును వర్జించవలెను, మరియు ఆవబచ్చలి, గుమ్మడి యిత్యాదిఅపథ్య వస్తువులదినరాదు—

# సాంకేతిక నామములు

**త్రికటుకములు** శొంఠి,పిప్పలి ,మిరియాలు.

**త్రిఫలములు** కరక, తాడి, యుసిరికలు.

**పంచమూలములు** ముయ్యాకుపొన్న కోల పొన్న, ములక, వాకుడు, పల్లేరు.

**పంచకోలములు** శొంఠి, పిప్పలి, మోడి, శేవ్యము, చిత్రమూలము—

## యంత్రములు=పుటములు

1 **వాలుకాయంత్రము** కుండకుసన్నని బెజ్జము వేశి ఇసుకబోసిగాజు కుప్పెలోమందువుంచి వంట జేయుట—

2 **గజపుటము** మూరన్నరచదరములం తేలోతు గలగోతిలో నూరుపిడకలతో పుటమిడవలెను—

3 **కుక్కుటపుటము** జానెడుచదరం జానెడు లోతుగలపల్లము త్రివ్విదానిలో 10 పిడకలతో పుటము వేయవలెను—

4 పాతనాయంత్రము కుండకుపైన యింకొకకుండ నొక్క మూతినిచేర్చిమూతులకు శీలమన్ను యిచ్చిపొయ్యిమీదపెట్టిపై కుండమీదపేడతో బురుజుగట్టి అందులోనీటినిపోయవలెను. యిదియింగిలీకములో నుంచి పాదరసము తీయునపుడు చేయవలశియుండును. పైవిధానము తెలిసిన వారినడిగిన చక్కగాబోధపడును—

## శుద్ధులు

**1** ఇంగిలీకం దీనిని నిమ్మపండ్లరసముతో బాగుగ నూరవలెను.

**2** తాళకము పలచగా రేకులవలిచి గుడ్డను మూటకట్టి సున్నపునీటచే డోలాయంత్రమున 2 ఝాములువండవలెను

**3** మణిశిల తాళకమునకువలెనేశుద్ధిచేయవలెను

**4** నాభి ముక్కలుగానరికి గోమూత్రంలో రాత్రి నానపెట్టి పగలుయెండించి మరల రాత్రిగోమూత్రం పోయుచు పగలు యెండించుచుండవలెను యిటుల 3 రోజులుచేయవలెను

**5** గంధకం అమరశిలగంధకమును ఆముదము యినుపగరిటెలో వేశి పుడికించవలెను చింకెరెక్కలగంధకము ను వాడుటమంచిది దీనినిక్రిపై ప్రకారమే శుద్ధిచేయవచ్చును.

**6** గరళం ఇది త్రాచుపాముపిషము, పుండ్లకు రక్తమునకు కన్నులకుతగిలిన ప్రాణాపాయము కలుగును గాన అతిజాగరూకతకలిగి యుండుడు దీనిని వెలిగారము తోనూరి మాత్రలుజేసి గోమూత్రముతో 3 రోజులు డోలాయంత్రమున వండవలయును. కొందరు దీనిని శుద్ధి చేయకుండానేవాడుచున్నారు

**7** రససింధూరం నిమ్మపండ్లరసముతో నూరి నతర్వాత బియ్యపు కడుగుతో నూరి యెండించవలెను

**8** పాదరసం ఇంగిలీకములోనుంచి తీసినపాద రసం అయితే శుద్ధిచేయనక్కరలేదు బజారులో కొన్నద యినయెడల. పసుపు ఉప్పు, యిటికెపొడుము కరుదూపము యివిచేర్చి రెండుజాములుమర్దించి మంచినీళ్లతో కడుగవలెను ఇంగిలీకమును వేపవేరుచెక్క రసముతోగాని నిమ్మపండ్ల రసముతోగాని ఒకజాముమర్దించి పాతనాయంత్రమున ర సముదీయవచ్చును ఈవిధానము తెలిసినవారినడిగి చేయవ లెను

**9** సైంధలవణము మేకమూత్రమున ఉడికిం చి కడుగుతో ఒకగంటనూరవలెను.

**10** తవాక్షీరి దీనిని వెదురుబియ్యమందురు పాలగుండయందుదానిని తవాక్షీరియని చెప్పి నమ్మించి బ జారులోనమ్ముచుందురు, సీమదేశమునుంచి దిగుమతీయగు చున్న జిలాయతీతావాక్షీరిచాలామంచిది. దుమ్ము నలక లు వగైరాలు లేకుండా పరిశోధనచేయుటయే దీనికిశుద్ధి

**11** కఫరి లేకపాలతుత్తము నిప్పుల యందుగాచి నిమ్మపండ్లరసమున నేడుసార్లుముంచిన సుద్ధి అగును

**12** ముషిణివిత్తులు తునకలుగాకత్తిరిం
చి చిరివేళ్లరసమున 3 గంటలు డోలాయంత్రమున వం
డవలెను

**13** నల్లఉమ్మెత్తగింజలు ఒకరోజు మ్మెపం
డ్లరసములో నానవైచి ఎండింపవలయును

**14** సౌవర్చలవణం నిమ్మపండ్లరసముతో
భావనచేసి యెండించిన శుద్ధిఅగును.

**15** నేపాళము గింజలపై పొరవలిసి ప
ల్చనిగుడ్డతో మూటకట్టి పేడనీళ్ళలో రెండుఝాములువు
డికించి లోపలనున్న మొలకలు అనగా లోపలిపొరలనుతీ
సివేసి తక్కినపప్పును ఆవునేతితో దోరగా వేయించవలెను.

**16** తగరపురేకులు వావిలాకురసమందు
పసపుచూర్ణముకలిపి అందు వంగపురేకులను కరగించిపోసి
న. శుద్ధియగును.

**17** ఇంగువశుద్ధి నువ్వులనూనెతో వేయిం
చిన శుద్ధిఅగును. తమలపాకురసమున భావనచేసి యెండిం
చిన శుద్ధిఅగును.

**18** వెండిరజను చాదీవెండిని ఆకురాయి
తో రజనుగా కోయించి దానిని చింతపండుపులుసుతో నే
డుమారులునూరి వుడకించవలెను.

**19** లోహపురజను ఉక్కునకు ఆకురాతితో రజనుగా కోయించి దానిని నువ్వులనూనెలో ఉడికించవలెను. తరువాత తుమ్మచెక్కరసముతో నూరి వుడికించి ఎండించవలెను.

**20** రసకర్పూరము తామరతూండ్లరసమందునూరి యెండించవలెను.

**21** బాలింతబోలు నిమ్మపండ్ల రసమున భావనచేయవలెను.

**22** శొంఠి పైపొట్టునుగీసి కొత్తసున్నం బట్టించి 3 గంటలు యెండించవలెను.

**23** పిప్పళ్లు చిత్రమూల రసంతో నానబెట్టి యెండించవలెను.

**24** మిరియాలు పుల్లటిమజ్జిగలో 3 గంటలునానవేసి పెంకులోపోసి వేయించవలెను.

**25** వెలిగారం బొగ్గులనిప్పులపైని నీరుతీసేలాగున పొంగించవలెను.

**26** జాజికాయలు ఆవునేతితో వేయించిన శుద్ధియగును.

**27** తిప్పసత్తు తిప్పతీగ తెచ్చిజానెడేసిముక్కలుగా కోసి రోటిలోదంచి నీళ్ళకడవలో 1 ఝాము నాన

వేసి కవ్వముతో చిలికి తేరనిచ్చి పై తెట్టు తీసివేసి తేరిన నీళ్ళు క్రమంగా వడిచివేసినతరువాత మెత్తగా సున్నవలె అడుగునకు చేరియుండును. దానిని యెండించి భద్రపర్చు కోవలెను.

## భస్మములు

**1** సువర్ణభస్మము మేలిమిబంగారు యరేకు న్నులో పొదిగి కుంపటిలోనూది కరిగించిన శుద్ధియగును. దానిని పలచగా రేకులువేసి దానిపై హేమాక్షీకములు నిమ్మపండ్లరసముతోనూరి లేపనముజేసి యెండించి మూడుగజపుటంబు లిడవలయును.

**2** రజితభస్మము చాదీవెండి రేకులు పల్చగా సాగగొట్టి చింతపండుపులుసులో నుడకపెట్టించికడిగి కొలిమిలో కాల్చి గోడ్డుకాకరగడ్డరసములో 7 సార్లు చల్లార్చిన శుద్దియగును. దీనికి సమము పాదరసము గంధకము సమానముగాజేర్చియా రెండింటికి సమము తాళకంచేర్చి కలబందరసంచే నూరి పై రేకులకు లేపనంబొనర్చి 30 పిడకలచే రెండుపుటములు వేయవలెను.

**3** లోహభస్మము శుద్ధిచేసిన లోహరజనుకు

12 వ వంతు శుద్ధిచేసిన యింగిలీకము చేర్చి కలబంద రసములో 6 గంటలుమర్దించి7 పుటము లువేయవలయును.

**4 తామ్రభస్మము** పాత డబ్బులను పలుచగా సాగగొట్టించి రేకులుచేసి గోమూత్రములో వైచి 3 గంట లు బాగుగకాచిన శుద్ధియగును. సదరు రేకులకు సమము గా పాదరసమున్ను గంధకమున్ను తెచ్చి జిల్లేడుపాలలో నూరి రేకులకు పట్టించి పుటంబిడిన భస్మమగును.

**5 కాంతభస్మము** సూదంటురాయిని నిమ్మ పండ్లరసము కలి పులిచల్ల అనువానితో పరితీదానితోను ఏడుమారులు ఏడేసిగడియలు నెండించిన శుద్ధియగును. స దరుకాంతముకు నాలుగవభాగం గంధకం తెచ్చి జిల్లేడు కొండపిండి మోదుగచెక్క వీట్లరసములచే మర్దించి మూ డుగజపుటము లిడవలయును.

**6 అభ్రికభస్మము** కృష్ణాభ్రికము రాయిని నలగగొట్టి కడుగులోపోసి నాననిచ్చి గోనెగుడ్డతో రాయు చు వడబోయవలెను. దీనినే ధాన్యాభ్రికమందురు. దీనిని తీసి యెండించి జిల్లేడుపాలతో నూరి జిల్లేడుఆకులు పైన యు క్రిందయు బరచి మూకుళ్ళలోనుంచి 7 గజపుటము లు బెట్టవలయును. దీనిని ఔషధములందుమాత్రమే వా డదగును.

**7** నాగభస్మము సీసము కరగించి జిల్లేడుపాలలో 3 సారులు పోసిన శుద్ధియగును. సదరు సీసము యినుపమూకుడులోనుంచి సమం మణిశిలపొడుము వేసి అడ్డసరముకర్రతో రాచుచూ వేయించవలెను.

**8** వంగభస్మము శుద్ధిచేసినతగరపు రేకులపై కఫరిని నూరి లేపనముచేసి అగ్నికాచిన భస్మమగును.

**9** వరాటభస్మము పసుపురంగుగల తేనెగవ్వలను నిమ్మపండ్లరసములో నానవేసి మూకుడులోపెట్టి పుటముపెట్టవలయును.

**10** శంఖభస్మము వరాటభస్మము వలెనే చేయవలెను.

**11** హేమాక్షికభస్మము హేమాక్షికమును నిప్పులలో కాచి త్రిఫలకషాయములో వేసిన శుద్ధియగును, సదరు హేమాక్షికమునకు 4 వ పాలు గంధకంచేర్చి ఆముదముచేనూరి గజపుటముబెట్టిన భస్మమగును.

**12** కర్పూరసిలాజిత్ తామరతూండ్లరసముతోగాని కలువదుంపరసముతోగాని 3 గంటలుమర్దిం

చిన శుద్ధియగును. కలబందరసముతో నూరి లఘుపుటము వేసిన భస్మమగును.

N. B. ఈ భస్మములన్నియు మందులలో చేర్చుకొనుటకు మాత్రమే పనికివచ్చును. పడిగా వ్యాధులమీద సేవించుటకు పనికిరావు వాటిని స్వచ్ఛముగా తయారుచేసుకొనుటకు వేరువేరుపద్ధతులు కలవు. అవి మిక్కిలి వ్రయుప్రయాసలకు లోనైయున్నవి.

స ం పూ ర్ణ ము

---

# సిద్ధౌషధములు

---

1 హిస్టరైన్ హిష్టీరియా అనగా గర్భాశయోన్మాదము. మూర్ఛ, నరములబలహీనత మొదలగు వ్యాధులకు అమూల్యమైనది. ఒకనెలకు సరిపడుమందు డబ్బి 1కి రు 5-0-0

2 ధాతుబంద్ శుక్లనష్టము స్వప్నస్ఖలనము నివారణయగును. వీర్యము గట్టిపడును. రతిదారుఢ్యము గలుగజేయును. వీర్య స్తంభనచేయును. ఒకనెలకుమందురు 4-0-0

3 డెస్మొరైన్ ఇది కఠినమైన ఋతుశూలను పోగొట్టును. పరిశోధనలుచేసి కనిపెట్టబడినది. 15 రోజులకు సరిపడుమాత్రిలు డబ్బి 1కి రు 2-0-0

4 ప్రదరాంతక్ మూడుజాతులకుసుమలకు దివ్యౌషధరాజము. అన్నిపరిమేహములలో కూడ పేరుపొందినది వెల డబ్బి 1 కి రు 5-0-0 (1 తులముమందు)

5 గర్భస్రావనివారిణి గర్భస్రావమునిలిపి సత్సంతానమును గలుగజేయును. వంధ్యాదోషములను పోగొట్టి గర్భధారణ కలుగజేయును. వెల 1 తులముమందు రు 5-0-0

6 పార్శ్వపుతలనొప్పిమాత్రలు పార్శ్వపుతలనొప్పి దినసి 7 దినములు సేవించుటవలన మరల తిరిగి యెన్నటికి

ని రాము, నిస్సంశయముగా కుదురును. 15 మాత్రలుగల డబ్బీ 1కి రు 2_0_0

7 డైజెస్టు:—పైత్యము అజీర్తి మలబద్ధము దీనిని సేవించుటవలన పోవును. బాలురు వృద్ధులు నిర్భయముగా సేవించవచ్చును, తత్వముమార్చి మలబద్ధముతొలగించుటలో నిది ఘనతకెక్కినది. వెల డబ్బీ 1 కి రు 2_0_0

8 కామవర్ధని నపుంసకత్వము శుక్లనష్టము నరములబలహీనత నిస్సత్తువ హరించును. రక్తశుద్ధిచేయును. శరీరమాంసమును వృద్ధిచేయును. ఇది బలమైనఆహారము వెల డబ్బీ 1కి రు 4_0_0

యోగ్యతాపత్రికలను వ్రాయుదు.

వీటన్నింటికిని పోస్టు ప్యాకింగు ఖర్చులు వేరు.

డాక్టరు కె. బి. శర్మ
పాలమూరు పశ్చిమ గోదావరిజిల్లా

---

## సుప్రసిద్ధవైద్య గ్రంధములు

---

1 ఓషధీగుణపంచభాషి ఈ పుస్తకములో సుమారు 800 వనమూలికలపేర్లు 5 భాషలలో వ్రాయుటయేగాక వాట్లసిద్ధగుణములు వాటిని సేవించుటవలన కలిగిన వి

కారమునకు శాంతులు అలబ్ధప్రతినిధివస్తువులు ప్రతినామములు మూలికలలోనుండు ప్రాముఖ్యమైన పదార్థము (Active Principle) మొదలగునవి పెక్కు శాస్త్రములు పరిశీలించి వ్రాయబడినవి. వెల ప్రతి 1కి రు 1-0-0

2 ఆసవారిష్టదీపిక దీనిలో ఆసవములు అరిష్టలుచేయువిధము విపులముగా అనేకశాస్త్రములు పరిశీలించివ్రాయబడినది. వెల ప్రతి 1 కి రు 0-8-0

3 ఆంగ్లేయవైద్యరహస్యము ప్రతికుటుంబీకుడును ప్రతిపల్లెటూరివైద్యుడును యింగ్లీషువైద్యము సులభముగా దీనివలన చేసికొనవచ్చును. వెల ప్రతి 1కి 0-8-0

4 కుటుంబచికిత్సాదర్పణం :—ఇందాయుర్వేద సులభచికిత్సలు, ఉపాయములు, ప్రథమచికిచ్చలు వ్రాయబడినవి. ప్రతియింట నుండదగినది. సాధారణముగ కుటుంబములోవచ్చెడు వ్యాధులకన్నింటికి ప్రతిమనుష్యుడు తెలిసికొనవలసియుండు చక్కని సలహాలు ప్రమాదములేని చికిత్సలు సూచించబడియున్నవి.

వీటికి పోస్టు రిజస్ట్రీషన్ప్యాకింగువగయిరా ఖర్చులు వేరు.

డాక్టరు కె. బి. శర్మ పోలమూరు.
పశ్చిమగోదావరిజిల్లా.

# పీ ఠి క.

ఆంగ్లేయవైద్యములోని ముఖ్యవిషయములను, ఇంగ్లీషురాని తెలుగువైద్యులకు దెలుపుటకుగాను యీగ్రంధమును ప్రకటించితిని తెలుగువైద్యగ్రంధములు అనేకములున్నవిగాని యింగ్లీషువైద్యగ్రంధము చిన్నది స్వల్పవెలలో లేనందున దీనిని వ్రాసితిని సాధారణముగ ప్రతికుటుంబీకుడును, యిందలివిషయములను తెలిసికొని లాభమును పొందుదురుగాత. తరుచుగ బజారునందు సులభవెలలకు దొరకునటువంటివిన్ని నిత్యకృత్యములో నుపయోగించు మందులనే యిందుచేర్చితిని. ఇట్టిగ్రంథము తెలుగులో సులభమైన వెలలో యిదివరకెవ్వరును ప్రకటించియుండలేదనియు, అటులప్రకటింపుడని పలువురుమిత్రులు ప్రోత్సాహపరచుటచే యీగ్రంథమును ప్రకటించితిని దీనియందుగల దోషములను తెలిపితిరేని రెండవకూర్పునందు సవరించి ప్రకటించెదను.

పాలమూరు

1-8-28

డాక్టరు కె బి. శర్మ

# విషయసూచిక


| పేరు. | గుణము | పేజీ. |
|---|---|---|
| అమోనియం కార్బొనేట్ | దగ్గులకు, రొంపకు | 5 |
| ఆలివ్ ఆయిల్ | సాధువిరేచనకారి | 25 |
| ఊపిరి | | 41 |
| ఉష్ణము | | 42 |
| ఎక్స్ట్రాక్టు కాస్కరా శాగ్రడాలిక్విడ్ | మలబద్ధమును తొలగించుటకు | 18 |
| ఐడోఫారం | పుండ్లమీద చల్లుటకు | 13 |
| కంటికిలోషను | | 31 |
| కరిమూనె | కుష్ఠువ్యాధులకు | 27 |
| కర్పూరతైలం | వాతనొప్పులకు పైకిమర్దనాకు | 20 |
| కాజపుట్ ఆయిల్ | తలనొప్పివగైరాలకు | 21 |
| కార్బాలిక్ యాసిడ్ | పురుగులను చంపు లోషనులు తయారుచేసుకొనుటకు | 12 |
| కాలొమెల్ | విరేచనములకు | 9 |
| క్వైనైన్ సల్ఫేట్ | మన్యపుజ్వరము తగ్గించుటకు | 16 |
| క్రైసొరోబిన్ | తామరకు | 20 |
| కొండనాలుక | | 33 |
| కోపైబానూనె | శగవ్యాధికి | 24 |
| కొలతలు, తూనికలు | | 33 |

గాలిక్ యాసిడ్ నీళ్లవిరేచనములురక్తగ్రహణికట్టుటకు 18

గ్లిసరైన్ విరేచనముచేయించుటకు (ఎనీమా) 25

గ్రిగొరీస్ పౌడర్ విరేచనమునుచేయుటకు 17

గ్రేపౌడర్ విరేచనములగుటకు 8

జ్ఞాపకముంచుకొనవలసినముఖ్యవిషయములు 40

చంటిబిడ్డల రోగములు. 30

చంటిబిడ్డల మోతాదును తెలుపుపట్టీ 37

చందినీ అత్తరు శగలకు, తెల్లకుసుమకు 24

చాల్మగ్రాఆయిల్ కుష్ఠురోగముకు 26

చెవిపోటు 31

చెవిలోచీము 32

చేపనూనెలేక కాడ్లివర్ఆయిల్ బలముకలిగించుటకు 26

జింక్ సల్ఫేట్ వాంతిజేయుటకు 7

జింకాక్సైడ్ పుండ్లమీదచల్లుటకు 7

టానిక్ యాసిడ్ కొండనాలుక వ్రాలినప్పుడు వ్రాయుటకు 19

టించర్ అయోడిన్ వాపులకు పైకివ్రాయుటకు 10

టించర్ ఓపై విరేచనములుకట్టుటకు 14

టించర్ కాంఫర్కో దగ్గు, జలుబు. 15

డయూరెటిన్ మూత్రముజారీచేయుటకు 15
డైల్యూటెడ్‌సల్ఫ్యూరిక్ కలరాలోనిచ్చుటకు
యాసిడ్ 10
డోవర్సుపౌడర్ విరేచనములుకట్టుటకు 14
తేలికైనఆహారవిశేషములు 35
థర్మామీటర్ 38
దాల్చినఅరకు అజీర్తికి 23
నాడి 41
నిర్మలోదకము(యాక్వాడెస్టిలేటా 1
నోటిపూతలువగైరా 32
నోటికిఫుక్కిలింత 32
పల్విస్‌జాలప్‌కో గాఢవిరేచనకారి 18
పానీయములు 36
పిక్రిక్‌యాసిడ్ కాలినపుండ్లకు 13
పెప్పర్‌మింట్‌ఆయిల్ అజీర్తికి 23
పేటెంటుమందులు 33
పొటాసియంబ్రోమైడ్ నరములఉద్రేకమునుతగ్గించును 1
పొటాసియంక్లోరస్ నోటికిపుక్కిలింతకు 2
పొటాసియంనైట్రిస్ మూత్రంజారీఅగుటకు 2
పొటాసియంఅయోడైడ్ సవాయికి ఉబ్బసమునకు 3
పొటాసియంపర్మాంగనేట్ పురుగులనుచంపుటకు కలరాకు 4
ఫినాసెటిన్ తలనొప్పికి 12

| | | |
|---|---|---|
| బార్బిటోనం | నిద్రకట్టించుటకు | 12 |
| బిస్మత్ సబ్ నైట్రస్ | విరేచనములుకట్టుటకు | 8 |
| బ్లూఆయంటుమెంటు | సవాయిపుండ్లకు | 9 |
| బోరిక్ యాసిడ్ | పుండ్లకు | 11 |
| మిశ్రిమములు (పెద్దవారికి) | | 27 |
| మెగ్నీసియంసల్ఫేట్ | విరేచనములగుటకు | 6 |
| యారొమాటిక్ చాక్ పౌడర్ | విరేచనములుకట్టుటకు | 6 |
| యాసెటిక్ యాసిడ్ | తామరకుపైకివ్రాయుటకు | 11 |
| యాస్పిరిన్ | తలనొప్పికి | 17 |
| యూకలిప్టస్ఆయిల్ | కీళ్లనొప్పులకుపైకిరాయుటకు | 21 |
| యూక్వినైన్ | మన్యపుజ్వరములకు | 17 |
| లవంగాలఅరఖు | జీర్ణశక్తినివృద్ధిచేయుటకు | 22 |
| వైద్యపరికరణములు | | 38 |
| వైనం యిపికాక్ | దగ్గు, కఫము తగ్గించుటకు | 15 |
| శాంటోనైన్ | ఏలికపాములను చంపుటకు | 19 |
| సిరిటక్సులఅమోనియాఆరోమాటికస్ | అజీర్తికిగుండెకుదృడము చేయుటకు | 5 |
| సోడియంబైకార్బొనేట్ | జీర్ణశక్తికలిగించుటకు | 4 |
| సోడియంసల్ఫేట్ | విరేచనములుచేయుటకు | 5 |
| సోపుఅరఖు | అజీర్ణమునకు | 23 |
| హైడ్రోజెన్ పెరాక్సైడ్ | చీముహరించుటకు | 1 |

## నిర్మలోదకము—Aqua Destillata

నేత్రవ్యాధులయం దుపయోగించు లోషనుల లోను,యింజక్షన్ చేసేమందులలో కలుపుకొనుటకును యీ పరిశుద్ధజలము నుపయోగింతురు. ఇదియింగ్లీషుమందుల షాపులలో వెలకు దొరకును.

## హైడ్రొజెన్ పెరాక్సైడ్—Hydrogen Peroxide

దీనియందు పురుగును చంపుగుణ మధికముగలదు. చీముతోకూడినపుండ్లమీద యీ అరఖుపోసిన బుసబుస మనిపొంగి పుండుపరిశుభ్రమగును. ఇది నీటివలెనేయుండును. చెవిలోచీమువగైరాకల్మషములున్నప్పుడు దీని చుక్కలు వేసినచో చెవి శుభ్రపడును. దీనిని లోపలకు నివ్వరు. దీనిసీసామూత తెరచియుంచిన, గుణముపోయి, నిది హరించిపోవును.

## పొటాసియం బ్రోమైడ్—Potassium Bromide

ఇది తెల్లటిపలుకులుగానుండును. నిదురపట్టించును మగతనుకలుగజేయును.మూర్ఛ, అపస్మారము(Hysteria) మొదలగు యీతుప్పవ్యాధులలో నిదివాడిన నరములకు మాంద్యమును కలుగజేసి రోగికి మగతను కలిగించి తాత్కాలికఫలము నిచ్చును. చంటిపిల్లలకువచ్చే జన్నికి(బాలపాపచిహ్నాలు) యిదియుపయోగించును. 6 వారములుగల వ

యస్సుపిల్లలకు వడ్లగింజలో నాల్గవవంతును, 3 మాసముల పిల్లలకు అరవడ్లగింజయెత్తును; ఆనయస్సుమించినవారికి, 9 నెలలువచ్చువరకును 1 వడ్లగింజయెత్తును, 3 లేక 4 సంవత్సరములు గలవారికి సంవత్సరము 1కి ఒకవడ్లగింజయెత్తు పరిమాణముగల మోతాదు హెచ్చించవలెను. ఈ జన్ని వ్యాధి మానువరకును ప్రతి 2, 3, 4 గంటలకొకసారి మోతాదు నిర్ణయించి యిచ్చుచుండవలెను. ఈమందు నీటిలో కలిపి యివ్వవలయును. ఈమందు విశేషకాల ముపయోగించినచో గొన్ని చెడులక్షణములు కలుగును.

మోతాదు5 మొదలు 30 గ్రియినులు

---

పొటాసియం క్లోరస్—Potassium Chloras

దీనిని నోటిపూతలోను, గొంతుకయందు తెల్లని పొక్కులున్నప్పుడును, చిగుళ్ళుబ్బినప్పుడును, రసపట్లలోను, నీటిలోకలిపి పుక్కిలింత పట్టెదరు. ఇందుకుగాను ఒక ఔన్సునీటిలో 8 గ్రియినులు యీమందును కలిపి పుక్కిలింతపట్టవలెను. దీనిని తరుచుగా లోపలకు వాడరు.

మోతాదు 5 మొదలు 15 గ్రియినులు.

---

పొటాసియం నైట్రిస్—Potassium Nitrate

ఇది యింగ్లీషువారిచేత పరిశుభ్రముగా తయారుచేయబడిన సూరేకారము. ఇదిమూత్రమును జారీచేయును,

దీనినెక్కువగా మూత్రముజారీచేసే అరఖులలో కలిపి లో పలకు నిచ్చెదరు. ఇది చమటను కూడ కలిగించును.

మోతాదు 5 మొదలు 20 గ్రెయినులు.

---

పొటాసియం అయోడైడ్—Potassium Iodide

సవాయిసంబంధమైనవ్యాధులలో కలిగిన కీళ్ళనొప్పులలోను, మేహవాతము వలనవచ్చు కీళ్ళవాపులలోను దీనినిలోనికివాడెదరు. దీనిని పాలసుగంధి కషాయములో మిశ్రమముచేసి యిచ్చిన మరింత బాగుగాగుణముచేయును. ఈ రెండునుకలిపిన మిశ్రమమును "అయోడైజ్డ్ సార్సపరిల్లా" అని అందురు ఇదిమందుల షాపులలో దొరకును. ఈపొటాసియం అయోడైడ్ను ముఖ్యముగా సవాయిలోను ఉబ్బసములోను వాడెదరు. పొటాసియం అయోడైడ్ పుచ్చుకొన్నప్పుడు కొందరికి జలుబుచేసి రొంపపట్టి గొంతుకనొప్పియును, తలభారమును కలుగును. ముక్కువెంబడి సీమవచ్చును అటువంటివారికి తాత్కాలికముగా మందుమాని గాని, మోతాదు తగ్గించికాని వాడవలెను. ఈగుణములు కలుగకుండ తరుచుగా దీనిని "ఆరోమాటిక్ స్పిరిట్ ఆఫ్ అమోనియా"తో కలిపి నిచ్చెదరు.

మోతాదు 5 మొదలు 20 గ్రెయినులు.

---

పొటాసియంపర్మాంగనేట్ Potassium Permanganate.

## విషము

ఇది ఊదావర్ణముగల పలుకులుగనుండును. దీనికి అధికమగు క్రిమిసంహారశక్తిగలదు. దీనిని నూతులలోను మురికికుండీలలోను వేసిన కలరాపురుగులు, యితరపురుగులు నశించును. కలరారోగికి యింగ్లీషుకంపెనీలలో తయారగు దీని 2 గ్రయినుల మాత్రలు రోగతీవ్రతనుబట్టి లోనికిచ్చినవాంతులు, విరేచనములు కట్టును. దీనిపలుకులు 2 లేక 3 ఒకగ్లాసు నీటిలోవేసినచో గులాబిరంగుగల లోషను అగును. ఆలోషనును నోటిలోపుండ్లున్నప్పుడును, పండ్లయిగుళ్లువాచినప్పుడును, రసముచేనోరు పట్టినప్పుడును పుక్కిలింతచేయవచ్చును. శగరోగముచేమూత్రనాళము వెంబడి చీముకారుచున్నప్పుడు దీనిలోషనును మూత్రనాళములోనికిమెల్లగా పిచికారీచేయుదురు. ఇదిబహుజాగ్రత్తగాచేయవలెను. అనుభవముగల డాక్టర్లచేత చేయించుకొనుటమంచిది. పాముకరచినచోట కత్తితోగీరి, దీనిపలుకులువేసి రుద్దినవిషము కొంతవరకుహరించును. మోతాదు 1 మొదలు 3 గ్రయినులు.

---

సోడియం బైకార్బనేట్— Sodium Bicarbonate.

దీనిని జీర్ణముకొరకు యిచ్చెడు అరఖులలో కలిపెదరు. ఇదిజీర్ణశక్తి వృద్ధిచేసి కడుపులోని శ్లేష్మమును (Mu-

cous) పల్చనచేయును. ఉదరశూల శాంతింపచేయును. ఎంతకాలమువాడినను ప్రమాదములేదు. మోతాదు 5 మొదలు 30 గ్రెయినులు.

---

సోడియం సల్ఫేట్ — Sodium Sulphate

ఇది సుఖవిరేచనకారి. నీళ్ళవిరేచనములుచేయును. మరలమరలనిచ్చు మోతాదు (Repeated administration) 30 మొదలు 120 గ్రెయినులుఒకేమోతాదు(Single administration) 2 మొదలు 4 డ్రాములు.

---

అమోనియం కార్బొనేట్ — Ammonium Carbonate

ఇది తెల్లనిముక్కలుగానుండి ఘాటుగలవాసనవేయుచుండును. నీటిలోకలిపియిచ్చిన కఫమును, దగ్గును తగ్గించును. దగ్గుకు యిచ్చెడు అరఖులలో దీనినికూడ కలిపి యివ్వవచ్చును. రొంప పడిశము పట్టినప్పుడు దీనినివాసన చూడవచ్చును. మోతాదు 3 మొదలు 10 గ్రెయినులు

---

స్పిరిటస్ అమోనియా ఆరోమాటికస్ — Spiritus Ammonii Aromaticus

ఏవ్యాధిలోనైనను, నిస్త్రాణగానున్నప్పుడును, సీరసించినపుడును, శరీరములో వేడితక్కువగా నున్నప్పుడును యీఅరఖు బహులాభకారి. దీనివలన అజీర్ణము, కడుపు

బ్బ, పులితేన్పులు నివారణయగును. ఇందుకు దీనినిసో డియం బైకార్బొనేట్‌తో కలిపి నీరుచేర్చియిచ్చిన ద్విగుణముగా పనిచేయును.

ఇది శ్లేష్మహారముగనుక దగ్గుకు యిచ్చెడు అరఖుల లోకూడ దీనిని కలిపెదరు.

మరల మరలనిచ్చు మోతాదు (Repeated administration) 20 మొదలు 40 మినిమములు

ఒకేమోతాదు (Single administration) 60 మొదలు 90 మినిమములు.

---

యారొమాటిక్ చాక్ పౌడరు—Pulvis creta Aromaticus

అజీర్తి, పులుసు కంపుగల విరేచనములుకట్టును ముఖ్యముగానిది చంటిపిల్లలవిరేచనములుకట్టుటకుమంచిది మోతాదు 10 మొదలు 60 గ్రెయినులు

---

✓ మెగ్నిసియం సల్ఫేట్—Magnesium Sulphate

దీనిని "ఎప్సమ్ సాల్టు" అని అందురు దీనినినీటిలో కలిపిపుచ్చుకొనుటవలన విరేచనములగును. ఇంగ్లీషువైద్యములోనిది ఎక్కువగా అందరిడాక్టర్లచేతను వాడబడుచున్నది.

మరల మరలనిచ్చెడు మోతాదు Repeated administration) 30 మొదలు 90 గ్రేయినులు

ఒకేమోతాదు (Single adminstration) 2 మొదలు 4 డ్రాములు.

---

జింక్ సల్ఫేట్—Zinc Sulphate విషము.

ఒకఔన్సు శుద్ధజలములో 2 గ్రేయినులు యీ మందువేసి తయారుచేసిన లోషను కండ్లకలకకు, కంటిలో చుక్కలుగా వేయవచ్చును. ఆలోషను కుసుమజబ్బులోను, శగవ్యాధివలన మూత్రద్వారమువెంబడివచ్చు స్రావములోను, రహస్యావయములలో పిచికారీచేయవచ్చును

పెద్దలకు 20 గ్రేయినుల జింక్‌సల్ఫేటు ఒకేసారి లోపలకు యిచ్చినచో త్వరలో వాంతిజేయును. వాంతిజేయుటకుపయోగించుమందులలోకెల్ల యిదిమంచిది. చంటిపిల్లలకు వాంతిచేయవలసివచ్చినప్పుడు 2 లేక 3 గ్రేయినులమందు యివ్వవలెను వాంతి అవనిచో పావుగంట అయిన పిమ్మట మరల ఆమోతాదేనియ్యవలెను.

మామూలుమోతాదు-1 మొదలు 3 గ్రేయినులు

వాంతిజేయుమోతాదు-10 మొదలు 30 గ్రేయినులు

---

జింక్ ఆక్సైడ్—Zinc Oxide.

ఈపొడి తరుచుగా లోపలకునివ్వరు. ఇదిగజ్జి, తీట

ఒరుపు రసికారుట మొదలగు చర్మవ్యాధులలో బాగుగ నుపయోగపడును. ఒకఔన్సు క్రొవ్వుగాని, వెన్నగాని తెచ్చి దానిలో 1½ డ్రాముల జింకాక్సైడ్‌ను కలిపి కలియ నూరిన ఆయంటుమెంటుపైనచెప్పిన చర్మవ్యాధులలో పనికివచ్చును.

---

బిస్మత్ సబ్ నైట్రిస్—Bismuth Subnitras.

ఈచూర్ణము కడుపునొప్పి, భోజనమైనతరువాత వచ్చువాంతులను, నీళ్లవిరేచనములను, గ్రహణిని పోగొట్టు ను ఇదినీటిలో కలియదు. తుమ్మజిగురు నీటితో మాత్రమే కలియును.

మోతాదు 5 మొదలు 20 గ్రెయినులు.

---

హైడ్రార్జిరంకంక్రిటా లేక గ్రేపౌడర్ (Grey powder)

విషము.

ఈచూర్ణములో పాదరసమును, సీమసున్నమును కలిసి బూడిదరంగు గలిగియుండును. చంటిపిల్లలకు అజీర్తి విరేచనములు కలిగినప్పుడు దీనిని ఒకగ్రెయిను యిచ్చిన, జీర్ణముకాని పదార్థము విరేచనముద్వారానెళ్ళిపోయి స్వస్తత యేర్పడును. పిల్లలకు విరేచనములు కావలసివచ్చినప్పుడు 1 గ్రెయిను యీపొడి ఆముదములోకలిపియిచ్చినచో కడుపులోని జిగట మొదలగుపదార్థములన్నియు వి

రేచనములద్వారా వెళ్ళిపోవును.రసభస్మమునకు బదులుగా దీనినుపయోగించవచ్చును.

మోతాదు 1 మొదలు 5 గ్రెయినులు

---

అంగ్యుఎంటమ్ హైడ్రార్జరీ Blue Ointment విషము
(బ్లూ ఆయంటుమెంటు)

దీనిని బ్లూ ఆయంటుమెంటు అనిఅందురు. ఇదిపాదరసముతో కూడినటువంటిది. సవాయిపొక్కులకు, కురుపులకు పైకిమాత్రమే రాయవలెను. లోపలికి యివ్వరాదు.

---

కాలోమెల్ Hydrargyri Subchloride విషము.

దీనినే రసభస్మమందురు. చంటిపిల్లలకు విరేచనములగుటకు దీనిని ఉగ్గులోపెట్టి సాధారణముగ వాడెదరు. శ్లేష్మమును పైత్యమును విరేచనము వెంబడి వెడలగొట్టును. కాలోమెల్‌తో చేసినబిళ్లలు (Calomel Tabloids) ప్రతియింగ్లీషుమందులషాపులలో దొరకును, వయస్సునుబట్టి, తత్వమునుబట్టి ఎన్నిగ్రెయినుల బిళ్ళకావలెనో నిర్ణయించుకొని తీసుకొనవలెను. తరుచుగా పెద్దలకు 3 గ్రెయినులు చాలును. పిల్లలకు 1 గ్రెయిను సరిపడును.

మోతాదు ½ మొదలు 5 గ్రెయినులు.

---

## టించర్ అయోడిన్—Tincture Iodine.

### విషము

ఈ అరఖు కురుపులవల్లవచ్చెడు బిళ్ళలకును, సంకటపుబిళ్ళలకును, వాపులకును, కీళ్ళవాపులకు మొదలైనవాటికి పైకి రాయుదురు.

ఇది వాపును తీయుటయేకాక తామర మొదలగు చర్మవ్యాధులకు రాయవచ్చును. ఇది పుండుకు తగిలినచో చాల మంటపెట్టును. దీనికిక్రిమిసంహారశక్తిగలదు. అందుచేతనే యింజక్షనుచేయుభాగము దీనితో ముందుగా శుభ్రముచేయుదురు. ఇది విషముగాన లోనికియిచ్చుట చాలతక్కువ.

---

## డైల్యూటెడ్ సల్ఫ్యూరిక్ యాసిడ్—Diluted Sulphuric Acid.

ఇది నీటితో మిశ్రమమైన గంధకద్రావకము. నీళ్ళవిరేచనములు, కలరా విరేచనములు అయినప్పుడు దీనిని నల్లమందుఅరఖుతో (Tincture opii) కలిపి నిచ్చెదరు. రోగికి దాహముగానున్నప్పుడు దీనిని నీటితో కలిపి నిచ్చిన దాహముకట్టును.

మోతాదు 5 మొదలు 20 మినిమములు.

---

## యాసెటిక్ యాసిడ్—Acetic Acid.

## విషము

ఈద్రావకము విషముగాన లోపలకు యివ్వరాదు. చర్మమునకిది తగిలిన పొక్కును. తామరకు యిది చాల మంచిది. ఒకదూదెకుంచె యీ ద్రావకముగల సీసాలో ముంచి తామరగలభాగమునకు రాసినచో నచ్చుటపచ్చిచేసి పొంగి క్రిమేపీ పొట్టువలె రాలిపోవును.

---

## బోరిక్ యాసిడ్—Boric Acid.

ఇది తెల్లటిపొడుము. దీనికి క్రిమిసంహారశక్తి గల దు. పుండ్లమీద చల్లెదరు. ఇది కొంచెము చెవిలో వేసిన చీముకారుట నయమగును. కండ్లకలకకు బోరిక్ యాసిడ్ 3 లేక 4 గ్రెయినులు ఒకఔన్సు నిర్మలోదకములో వేసి లోషనుచేసి కంటిలో వేసుకోవలెను.

ఒక ఔన్సు వేడినీటిలో 5 గ్రెయినుల బోరిక్ యాసిడ్ కలిపి తయారుచేసిన లోషనును చెవిలో చీముకారు చున్నప్పుడు పిచికారీచేయుట కుపయోగించవచ్చును.

ఒకభాగము బోరిక్ యాసిడ్, 9 భాగములు క్రొవ్వుగాని, వాసలైన్‌గాని కలిపి ఆయింటుమెంటు తయారు చేసికొని, పుండ్లకు చిడుముకు రాసిన కుదురును.

1 పాలు బోరిక్ యాసిడును, 8 పాళ్ళు తేనెతో గాని, గ్లిసరైన్‌తోగాని కలిపిన మిశ్రమమును నోటిలోని

పూతలకును, గొంతుకలోని పుండ్లకును రాయుదురు.

---

బార్బిటోనమ్ లేక వెరొనాల్—Barbitonum

ఇది తెల్లటి తళుకుగల చూర్ణము. నిద్రపట్టించుట కిది ముఖ్యముగా వాడెదరు. రోగులకు సంధించి నిద్రపట్ట కయున్నప్పుడును, పిచ్చివాండ్రకు నిద్రపట్టుటకును దీని నిత్తురు.

మోతాదు 5 మొదలు 10 గ్రెయినులు.

---

ఫినాసెటిన్—Phenacetin

ఈచూర్ణమును తలనొప్పి తగ్గించుటకు నెక్కువగా వాడెనదరు. జ్వరముతగ్గి చమట పట్టును. ఈమందు నోటిలో వేసికొని నీటితో మ్రింగవలెను. ఈమందు బిళ్ళలరూపముగా కంపెనీలలో అమ్మబడును.

మోతాదు 5 మొదలు 15 గ్రెయినులు.

---

కార్బాలిక్ యాసిడ్—Carbolic Acid

## విషము

కార్బాలిక్ ద్రావకము చర్మమునకు తగిలిన చర్మముకాని బొబ్బ లేలును. ఇదిబలమగు విషముగాన లోనికి యివ్వగూడదు. ఇది ఒక భాగము, 10 మొదలు 20పాళ్లు

కొబ్బరినూనిలోగాని, నువ్వులనూనిలోగాని కలిపి రాసిన, కాలినపుండ్లు, గాయములు, గజ్జి, కుష్టు, దీర్ఘకాలపు యితరచర్మ రోగములు కుదురును.

ఈద్రావకము 1 భాగమును. 40 భాగములు వేడినీరును కలిపి తయారుచేసిన లోషన్, గాయములు, పుండ్లు కడుగుట కుపయోగించును. రోగులుండు గదులలోను మురికికుండ్లు, తూములు మొదలగు దుర్వాసన స్థలముల లోనిది చల్లిన క్రిములన్నియు నశించును. ఈద్రావకమున కు అధికమగు క్రిమిసంహారశక్తి గలదు.

---

## పిక్రిక్ యాసిడ్—Picric Acid

ఇది ఒకవిధమగు పసుపురంగుతోమెరుపుగల ఘన పదార్థము. ఇది ఒక భాగమును నూరుభాగముల వేడినీటిలో కలిపి తయారు చేసినలోషనుతో కాలినపుండ్లను కడిగిక కట్టెదరు. కాలినపుండ్లకిది ముఖ్యమైనమందు దీనిని లోపలకు యివ్వరు

---

## ఐడోఫారం—Idoform.

వేమన పంపా పత్రి కల్రాల ( ) ఫాలయం, కృష్ణా జిల్లా.

విషము

ఇదిలోపలకు ఉపయోగించరు. దీనికిబలమగుక్రిమి సంహారశక్తి గలదు. పుండ్లుచీముపట్టినప్పుడు, కుళ్లినప్పుడు దీనిని చల్లిన చక్కగాపనిచేయును. 1 భాగము ఐడోఫా

రంను, 2 భాగములు బోరిక్ యాసిడ్ను కలిపితయారుచేసిన పొడుము చెవిలో వేసిన చీముకారుట, దుర్వాసనపోట్టు టతగ్గును.

1 పాలు అయిడోఫారం, 9 పాళ్లు క్రొవ్వుతోగాని వాసలైన్తోగాని ఆయింటుమెంటు తయారుచేసికొని చీముపట్టిన కురుపులకుగాని, పుండ్లకుగాని పట్టించిన చాల మంచిది.

---

డోవర్స్ పౌడర్ లేకపల్వీస్ యిపికాక్ కో-Dover's Powder

ఈచూర్ణము గ్రహణిలో ముఖ్యముగా వాడెదరు. నీళ్ళవిరేచనములుకూడ కట్టును. ఇది జ్వరము రొంప, దగ్గుకూడపోగొట్టును. దీనిని గ్రిహ.శిరోగములో ("బిస్మత్ సబ్ నైట్రిస్"( అనేమందుతో కూడ:కలిపి యిచ్చెదరు.. ఇట్లు చేయుటవలన గుణము హెచ్చగును. దీనిలో నల్లమందు భాగముకూడ కలిపియుండును.

మోతాదు 5 మొదలు 15 గ్రెయినులు.

---

టించర్ ఓపై లేకలాడనమ్—Tincture opii

విషము

ఇదినల్లమందుతో తయారుచేసిన అరఖుఅయి యున్నది. ఇది నీళ్లవిరేచనములు, గ్రిహాణి తగ్గించును. మగతనుకలుగజేసి శరీరముయొక్క నొప్పులను పోగొట్టును. చెవి

పోటుగానున్నప్పుడు యీఅరఖుకు సమం నూనెగాని గ్లిసరైన్‌గాని చేర్చిచెవిలో అప్పుడప్పుడు పోయుచుండిన చెవిపోటుతగ్గును.

మరలమరల నిచ్చు మోతాదు (Repeated administration) 5 మొదలు 15 మినిమములు ఒకేమోతాదు. (Single administration) 20 మొదలు 30 మినిమములు.

---

టించర్ కాంఫర్ కో (Tincture Camphor Co)

ఈఅరఖు దగ్గును రొంపనుపోగొట్టును, కఫమును వెలిబుచ్చును. దీనిలోకొద్దిపాలు నల్లమందు కలసియుండును. దగ్గుతగ్గించు అరఖులలో నిదికలియును.

మోతాదు $\frac{1}{2}$ మొదలు 1 డ్రాము.

---

డయూరెటిన్—Diuretin

మూత్రమును జారీచేయుటలో నిది చాలగొప్ప ఔషధము. ఇది తెల్లని చూర్ణము. నీటిలో కలియును. నంజువ్యాధిలో మూత్రమును జారీచేయుటకిదివాడదగినమందు.

మోతాదు 10 మొదలు 20 గ్రెయినులు

---

వైనం యిపికాక్—Vinum Ipecac.

ఈఅరఖు శ్లేష్మసంబంధములగు అరఖులలో పనిచేయు

ను. కఫమును పల్చనచేయును. ఇతరసగ్గుమందులలో దీనిని చేర్చెదరు. ఎక్కువ మోతాదులలో నీలరఖువాంతిని చేయును.

కఫహర మోతాదు—10 మొదలు 30 మినిమములు.

వాంతిజేయు మోతాదు—4 మొదలు 6 డ్రాములు.

---

క్వినైన్ సల్ఫేట్—Quinine Sulphas

దీనిని క్వైనా అని అందురు. చలిజ్వరములకు నిది సిద్ధౌషదము. ఆజ్వరసంబంధమగు పురుగును చంపుటకు దీనికే శక్తి గలదు. ఈ చూర్ణము నీటిలో కలియదు. నీరుకలపిన గంధకద్రావకము (Diluted Sulphuric Acid)లో గాని, నిమ్మరసములో గాని కరగును. దీనిని యీరెండింటిలో నేదేనియొక దానిలో కరగనిచ్చినపిమ్మట నీరుచేర్చి పుచ్చుకోవలెను. ఇదిబహు చేదుగానుండును. అందుచేత చాలామంది దీనిని పుచ్చుకోలేరు. సులభముగా లోనికి మింగుటకు దీనిసంబంధించిన బిళ్లలు(Quinine Tabloids) ఇంగ్లీషుమందుల షాపులలో దొరకును. క్వైనాచూర్ణము గల పొట్లములు పత్తితపాల ఆఫీసులోనువెలకు లభించును. చాలాకాలము యీక్వైనా సేవించుటవలన చెముడుమొదలగు దుర్లక్షణములు కలుగును. చలిజ్వరములలో క్వైనా శరీరములోనికి యింజక్షనుకూడచేయుదురు.

మోతాదు 1 మొదలు 10 గ్రయినులు

యూక్వినైన్—Eqni 'ine.

ఇదికూడక్వైనావలెనే చలిజ్వరములో పనిచేయును. క్వైనాకు ఉండెడిచేదు దీనికిఉండదు. ఇది రుచలేకుండా తెల్లటిపొడుముగానుండును. దీనియందుచేదులేదుగనుక పిల్లలుకూడ సులభముగా తీసుకొందురు.

మోతాదు 3 మొదలు 15 గ్రియినులు

---

యాస్పిరిన్—Aspirin.

ఇది తెల్లటి తళుకుగల చూర్ణము. దీనివలనముఖ్యముగా తలనొప్పి శరీరము నొప్పులు తగ్గును. జ్వరము కూడ శాంతించును. దీని సంబంధమగు బిళ్ళలు 5 గ్రియినులు గలవి షాపులలో దొరకును. ఒకటిలేక రెండుబిళ్ళలు మిగ్రింగినచో తక్షణం తలనొప్పి తగ్గిపోవును.

మోతాదు 5 మొదలు 15 గ్రియినులు

---

గ్రిగొరీస్ పౌడర్ లేక పల్విస్ రీ అయికో Pulvis Rhei Co

దీనిని రూబర్బుపౌడర్ అని అందురు. ఈ చూర్ణము అజీర్ణమును, ఆంబమును పోగొట్టి విరేచనముచేయును దీనిని పిల్లలకు ముఖ్యముగా వాడెదరు.

మోతాదు 10 మొదలు 60 గ్రియినులు.

పిల్లలకు మోతాదు 4 గ్రియినులు

---

ఎక్స్ట్రాక్టు కాస్కరాశాగ్రిడా లిక్విడ్
(Extractum Cascara Sagrada Liquidum)

ఈఆరకము ప్రతిరోజు ఉండే దీర్ఘకాలపు మలబద్ధములలో వాడెదరు. క్రమేపీ రోగి తత్వమునుమార్చి కాల విరేచనము చేయుచుండును. ఇది యిచ్చుటకు ప్రారంభించి నప్పుడు మోతాదు క్రమక్రమముగా హెచ్చించి తరువాత క్రమేణా మోతాదు తగ్గించి పిమ్మటదీనిని పూర్తిగా మానివేయవలయును. ఇట్లు రెండుమాసములైననూ, మందు ఉపయోగించినగాని మలబద్ధము పూర్తిగా నివారణ కాదు.

మోతాదు ½ మొదలు 1 డ్రాము.

---

పల్విస్ జాలప్ కొ Pulvis julap Co

ఇది తెగడతో తయారుచేసిన మిశ్రితచూర్ణము చాలబలమగు విరేచనకారి. నీళ్ళవిరేచనములను జేయును నంజులో (Dropsy) దీని నుపయోగించుట మంచిది. గర్భిణీస్త్రీలకు దీని నివ్వరాదు.

మోతాదు 10 మొదలు 60 గ్రైనులు

---

గాలిక్ యాసిడ్—Gallic Acid

ఇది మాఘలకాయతో సంబంధించిన సత్తు.నీళ్లవి రేచనములు, రక్తగ్రహణి దీనివలన కట్టును. దీనిని లోహ

సంబంధముగు మందులతో కలిపి నివ్వకూడదు.

మోతాదు 5 మొదలు 15 గ్రెయినులు.

---

టానిక్ యాసిడ్—Tannic Acid

ఈ చూర్ణముకూడ మాచికాయనుండియే తయారు చేయబడును. దీనిని లోపలకు తరుచు వాడరు.

ఇది 1 భాగమును, 5 భాగములు గ్లిసరైనుగాని తేనెగాని కలిపిన మిశ్రమమును, కొండనాలుక వాచినప్పుడును, గొంతుక వాపులలోను కూడ రాయుదురు.

మోతాదు 5 మొదలు 10 గ్రెయినులు.

---

శాంటొనైన్—Santonine

ప్రేగులలోనుండుపలికపాములను (Round Worms) చంపుటకిది ముఖ్యమైనమందు. ఇందుకుగాను దీనిని పరగడుపున పంచదారలో వేసి పుచ్చుకొని పిమ్మట 2 గంటలైనతరువాత ఆముదము పుచ్చుకొనిన పాములు విరేచనములలో పడిపోవును. పెద్దలకుగ్గాని పిల్లలకుగాని చిన్నమోతాదులు వాడుటయే మంచిది. పెద్దమోతాదులుదుర్గుణములను కలుగజేయును.

మోతాదు 1 మొదలు 3 గ్రెయినులు

---

## క్రైసరోబిన్—Chrysarobin

ఇది పసుపురంగుగల చూర్ణము. ఇది తామరకు చాలమంచిపని చేయును. ఇది ఒకభాగమును, వాస్లైన్ 24 భాగములును కలిపి తయారుచేసిన ఆయంటుమెంటును తామరకు చర్మముపై రాయుదురు. దీనివలన బట్టలు కరుప్రిఅగును. దీనిని లోపలకు నుపయోగింపరు. ఇది నేత్రములకును, నోటికిని తగులకూడదు.

---

## కర్పూరతైలం—Oil of turpentine.

సామాన్యముగ బజారులోని అంగడులలో దొరకెడు కర్పూరతైలములో కిరుసనాయిలునుకలిపెదరు. అందుచేత అక్కడ కొనకూడదు. నమ్మకమైన పెద్దయింగ్లీషు షాపులలో స్వచ్ఛమైన తైలము దొరుకును.

కీళ్ళనొప్పులు, ఇరుకునొప్పులు, నడుమునొప్పి,కండలోను నరములలోను ఉండేనొప్పులు, వీటికిపైకి మర్దనాచేయుటకిది ఉపయోగించును. దగ్గులకు రొమ్ముమీదను, కడుపునొప్పికి కడుపుపైనను మర్దనాచేసి వేడినీటికాపడము పెట్టవలెను. కలరాలోను, విషజ్వరములలోను కాళ్ళు చేతులు చల్లబడినప్పుడు వేడిపుట్టించుటకు యీతైలమును మర్దనాచేసి వేడినీటికాపడము పెట్టవచ్చును. దీనిని లోపలకు చాలజాగ్రత్తతో నియ్యవలయును. దీనిని ఆముద

ముతో కలిపి లోపలకునిచ్చిన ఏలికపాములు, పొడవైన పాములు (Tape worms) నులిపురుగులు మొదలైనవి నశించి క్రిందపడిపోవును. పేగులలోని వాయువును వెడలించును. సన్నిపాతజ్వరములలో పేగులలోనిపుండుచితికి రక్తస్రావమగుచున్నప్పుడు కొందరుడాక్టర్లు రక్తముకట్టుటకు దీనిని లోపలకునిచ్చెదరు. ఈతైలమును లోపలకు అనుభవముగల వైద్యులుమాత్రమే వాడవలెను. దీనిని గురదాల (Kidneys) జబ్బుస్థితిలో లోపలకుయివ్వరాదు.

మోతాదు—2 మొదలు 10 మినిమములు. పాములను చంపుట కిచ్చుమోతాదు 3 మొదలు 4 డ్రాములు.

---

కాజపుట్ ఆయిల్—Cajaput oil.

దీనిని ఏలకు అరఖు అని అందురు. తలనొప్పికి దీనిని కణతలకు రాయుదురు. దీనిని మేహవాతనొప్పులలోను, కీళ్లవాపులలోను పైకిమర్దనాచేయవచ్చును. కొంచెము పంచదారమీద ఒకచుక్క తైలంవేసుకొని లోనికి పుచ్చుకుంటే జీర్ణము చేయును.

మోతాదు ½ మొదలు 3 మినిమములు.

---

యూకలిప్టస్ ఆయిల్—Oil of Eucalyptus

ఇది బజారులో ప్రతిచోటను దొరకును. ఘాటుగలవాసనగనుండును. దీనిఘాటు వాసనకు పురుగులు

నశించును. కీళ్ళనొప్పులు, వాపులు, మేహవాతనొప్పులు దీనినిమర్దనాచేయుటవలన నయమగును. రొమ్ముపడిశము నందు దీనిని రొమ్మునకు రాశి వేడినీటి కాపడముపెట్టవలెను. శ్వాసకోశవ్యాధులలో దీనిని దూదిపై వేసి ఆదూదివాసన చూచుచుండిన మంచిది.

ఈతైలం 1 భాగము, వాస్‌లైన్‌గాని క్రొవ్వుగాని 9 భాగములు కలిపి తయారుచేసిన ఆయింటుమెంటు కురుపులకు రాశిన చీముపట్టవు.

యూకలిప్టస్ ఆయిలును, శ్లేష్మవ్యాధులలోను, అజీర్ణవ్యాధులలోను లోనికివాడెదరు. మోతాదు ½ మొదలు 3 మినిమములు.

---

లవంగాల అరఖు Oil of Cloves

ఇది లవంగాల అరఖు తలనొప్పికి దీనిని కణతలకు రాయవచ్చును ఇదిలోపలకు నిచ్చుటవలన జీర్ణశక్తి వృద్ధి చేయును. సువాసనగానుఆరోగ్యముగానుండును. ప్రేగులలో నుండువాయువును వెడలగొట్టును. కడుపునొప్పి తగ్గించును. పుప్పిపంటి డొలకలోదీనిచుక్కలు వేసిన బాధ శాంతింపవచ్చును.

మోతాదు ½ మొదలు 3 మినిమములు.

---

## దాల్చినఅరఖు—Oil of Cinnamon.

అజీర్ణిని పోగొట్టును. సువాసనగలదై యుండును. పేగులలో క్రిములను చంపును. విరేచనములు కట్టును. దీనియందు క్రిమిసంహారశక్తి గలదు గనుక ఒకప్పుడుసన్ని పాతజ్వరములలోను, యిన్‌ఫ్లూఎంజాజ్వరములలోను లోనికి దీని నిచ్చెదరు.

మోతాదు $\frac{1}{2}$ మొదలు 3 మినిమములు.

---

## పెప్పర్‌మింటు ఆయిల్ (Oil of Peppermint)

ఇది మంచిసువాసనగనుండును. చర్మమునకు తగిలిన చల్లగానుండును. తలనొప్పివచ్చినప్పుడు దీనిని కణతలకు రాయుదురు దీనియందుకూడ క్రిమిసంహారశక్తి గలదు. ఇది ఎక్కువ జీర్ణకారి. అజీర్తి పోవుట కిచ్చెడు అరఖులలో దీనిని కూడకలిపెదరు.

మోతాదు $\frac{1}{2}$ మొదలు 3 మినిమములు.

---

## సోపు అరఖు—Oil of Anisi

పిల్లలకు కలిగెడు కడుపుబ్బరము, అజీర్తికి నిది చాలమంచిది. కఫముతోకూడిన దగ్గులమీాద కూడ పని చేయును.

మోతాదు $\frac{1}{2}$ మొదలు 3 మినిమములు.

---

కొపైబా నూనె—Oil of Copaiba.

ఇది శగసంకటములలో ముఖ్యముగా వాడఁబడినది. శగవ్యాధియొక్క ప్రథమదశయందుగాని తీవ్రస్థితిలో గాని దీనినివ్వరాదు. అట్లు యిచ్చినచో జబ్బు ఎక్కువ అగును. దీనిని ఎక్కువమోతాదులలో నిచ్చినచో జీర్ణాశయమును పాడుచేసి వాంతులు, కడుపునొప్పి, విరేచనములు మొదలగు దుర్లక్షణములను కలుగజేయును. దీనిని సేవించుటవలన కొన్ని సమయములయందు శరీరముమీద పొక్కులు బయలుదేరవచ్చును.

మోతాదు 5 మొదలు 20 మినిమములు.

---

చందినీఅత్తరు—Santal Oil

శగసంకటములలో నిదిచాలప్రయోజనకారిగా నుపయోగించబడును. 5 చుక్కలు ఒకమోతాదుగా ప్రారంభించవలెను. దీనిని బహుజాగ్రత్తతో నుపయోగించవలెను. ఎక్కువమోతాదులవలన శరీరముయొక్క ఆరోగ్యము చెడి హాని కలుగును. కొన్ని అంగడులలో దీనిని కల్తీచేయుదురు గనుక మంచిదియు స్వచ్ఛమైనదియు సంపాదించవలెను. స్త్రీలకు కుసుమరోగములోకూడ నిది పనిచేయును.

మోతాదు 5 మొదలు 30 మినిమములు.

---

### ఆలివ్ ఆయిల్.—Olive Oil

దీనిని జయతూన్ చమురని అందురు. ఇది సాఫు విరేచనము చేయును. మలబద్ధమునందును, గుదస్థానము నందు పుండుకలిగినప్పుడును, పేగులలో పుండుకలిగినప్పుడును, లోనికిచ్చినగాని, గుదస్థానములోనుంచి ఎనిమాచేసినగాని యిది సునాయాసముగ విరేచనము గావించును. ఇది మృదువుగానుండును గనుక దీనిని ఆయింటుమెంట్లలోను పిండికట్లలోను కలుపుచుందురు.

మోతాదు 2 మొదలు 8 డ్రాములు.

---

### గ్లిసరైన్—Glycerine

ఈ చమురు తెలుపుగానుండును. గొంతుకవాపులోను కొండనాలుక వ్రాలినప్పుడును నాలుకమీదపొక్కులుకలిగినప్పుడును దీనిని బోరిక్ యాసిడ్‌తోను, టానిక్ యాసిడ్‌తోను, కలిపినోటిలో రాయుదురు.

ఇది విరేచనముచేయును. ఇందుకుగాను ఒకఅవున్స గ్లిసరైన్ గుదస్థానమందు పిచికారీచేసినచో వెంటనే సునాయాసముగా విరేచనమగును. దీనినితరుచుగా లోపలకునివ్వరు. మోతాదు 1 మొదలు 2 డ్రాములు.

---

### చాల్మగ్రా ఆయిల్—Chaulmogra Oil

దీనిని కుష్ఠువ్యాధిలో చర్మముపై రాయుదురు.

4

కొద్దిమోతాదులతో ప్రారంభించి క్రమేపీ హెచ్చించుచు దీనిని యీ వ్యాధిలో అనుభవనీయులగు వైద్యులువాడె దరు. దీనిని సేవించుట అలవాటుపడినగాని, ఇదికడుపులో న, పేగులలోను మంటబుట్టించును.

మోతాదు 5 మొదలు 10 మినిమములచొ॥ ½ డ్రా ము మొదలు 1 డ్రామువరకు హెచ్చించవచ్చును.

---

కాడ్ లీవర్ ఆయిల్ లేక చేపనూనె—Cod Liver Oil

ఇది పసుపురంగుగానుండి అసహ్యాకరముగ వాసన వేయుచుండును. అందుచేత దీనినిలోపలికి పుచ్చుకొనుట కు కొంచెముఆటంకముగా నుండును.

1 క్షయవ్యాధులలో నిదిమిక్కిలి ఉపయోగింతురు

2 కీళ్ళకు, ఎముకలకు గలిగినవ్యాధి ముఖ్యముగా "రికెట్సు" అను వ్యాధిలో తప్పక పనికివచ్చును.

3 ఎండిపోవుచున్న చిన్నపిల్లలకు యిదియిచ్చిన త్వ రలో మాంసమును పట్టించి బలమును కలుగజేయును. నరములకుబలమునిచ్చును.

4 పిల్లలకు కలిగెడు మొండి మలబద్ధము యీచే పనూనె ఉపయోగించు చుండుటవలన కుదురును.

దీనిని జీర్ణకోశము బాగుగాలేనప్పు డుపయోగింప రాదు. కొద్దిమోతాదులతో ప్రారంభించి క్రమేపీ హె

చ్చించవలెను. ఎక్కువమోతాదు సుఖవిరేచనముచేయును
మోతాదు 1 మొదలు 4 డ్రాములు.

---

కర్రినూనె—Wood Oil

ఈ కర్రినూనెను కుష్టువ్యాధులలో చర్మమునకు మర్దనా చేయుటవలన లాభకారికానుండును. యీవ్యాధిలో దీనిని లోపలకు కూడనిచ్చెదరు.
మోతాదు ½ మొదలు 2 డ్రాములు.

---

(పెద్దవారికి) మిశ్రమములు—Mixtures

డయఫారెటిక్ మిక్చర్—(చెమటను బుట్టించిజ్వరముతగ్గించుటకు)

సొల్యూషన్ ఆఫ్ అమోనియుం యాసెటేట్ 1½ ఔన్సులు
స్పిరిట్ ఆఫ్ నైట్రిస్ యీథర్—1½ డ్రాములు
టించర్ ఆఫ్ హయోశ్యామస్—2 డ్రాములు
పొటాసియుం నైట్రేట్—30 గ్రెయినులు
నీరు—8 ఔన్సులు

మోతాదు—1 మొదలు 2 ఔన్సులు

---

క్వినైన్ మిక్చర్—(చలిజ్వరములోనిచ్చుటకు)
క్వినైన్ సల్ఫేట్—48 గ్రెయినులు
డైల్యూటెడ్ సల్ఫ్యూరిక్ యాసిడ్—40 మినిమములు
సిరప్—6 డ్రాములు

నీరు— 11 ఔన్సులు

ముందుగా క్వినైన్ సల్ఫేట్, డైల్యూటెడ్ సల్ఫ్యూరిక్ డ్రావకములో కలిపి కరగనిచ్చి తరువాత నీరు కలిపేది దీనిలో సిరప్ అనగాపంచాదార షర్బతు, క్వైనా యొక్క చేదుతగ్గుటకు మాత్రముకలిపెదరు.

మోతాదు 1 మొదలు 3 ఔన్సులు

---

ఇపికాక్ ఓపియాటా మిక్చర్—(దగ్గులకు)

సోడియం బై కార్బొనేట్—60 గ్రెయినులు.

వైనం యిపికాక్— 2 డ్రాములు

స్పిరిట్ క్లోరోఫారం— 3 డ్రాములు

టించర్ కాంఫర్ కో— 4 డ్రాములు

నీరు— 11 ఔన్సులు

మోతాదు 1 ఔన్సుమాత్రమే

---

కార్మినేటివ్ మిక్చర్—(అజీర్తిపోవుటకు)

స్పిరిట్సు అమోనియా ఆరోమాటికస్— 3 డ్రాములు

సోడియం బై కార్బొనేట్—90 గ్రెయినులు

స్పిరిట్సు క్లోరోఫారం—3 డ్రాములు

టించర్ కార్డమమ్ కో—6 డ్రాములు

పెప్పర్ మెంటు నీరు—$10\frac{1}{2}$ ఔన్సులు

మోతాదు 1 ఔన్సు.

---

డయూరెటిక్ మిక్చర్—(మూత్రంజారీయగుటకు)

స్పిరిట్ ఆఫ్ జూనిపర్—3 డ్రాములు
పొటాసియం యాసెటేట్—120 గ్రెయినులు
పొటాసియం నైట్రేట్—120 గ్రెయినులు
స్పిరిట్ ఆఫ్ నైట్రిస్ యీథర్—6 డ్రాములు
నీరు— 12 ఔన్సులు
మోతాదు 1 ఔన్సు

---

యాసిడ్ సల్ఫ్యూరిక్ కం ఓపియోమిక్చర్ (విరేచనములు కట్టుటకు)
డైల్యూటెడ్ సల్ఫ్యూరిక్ యాసిడ్—2 డ్రాములు
టించర్ ఆఫ్ ఓపియం—2 డ్రాములు
సిన్నామన్‌వాటర్ లేక దాల్చినచెక్క కలిపిననీరు—
$11\frac{1}{2}$ ఔన్సులు.
మోతాదు 1 ఔన్సు

---

పైని చెప్పిన మిక్చర్లు పూటకొక మోతాదు చొ॥న పుచ్చుకొనవలెను.

---

గ్రహణికట్టుటకు పౌడరు
బిస్మత్ సబ్ నైట్రిస్—15 గ్రెయినులు
డోవర్స్ పౌడరు—15 గ్రెయినులు
శాలాల్—15 గ్రెయినులు

ఇట్లు చేసి 3 పొట్లములుకట్టి 4 గంటలకొకపొట్లము మంచినీటితో పుచ్చుకొనవలెను.

## చంటిబిడ్డలకు యోగములు

పల్వీస్ డోవరీకంక్రీటా యారోమాటికా (గ్రహణి కట్టుట కు చూర్ణము)

డోవర్సు పౌడరు—½ గ్రయిను

ఇపికాక్ పౌడరు—1 గ్రయిను

యారోమాటిక్ చాక్ పౌడరు—3 గ్రయినులు

ఇట్లుకలిపి రోజు 1కి 3 మారులు యివ్వవలెను.

---

పల్వీస్ మెగ్నీసియా ఎట్ బిస్మత్ (విరేచనములు కట్టుట కు చూర్ణం)

మెగ్నీసియం కార్బొనేట్—1 గ్రయిను

బిస్మత్ సబ్ నైట్రేట్—1½ గ్రయినులు

రూబర్బ్ పౌడరు—1 గ్రయిను

ఇట్లుచేర్చి రోజుకు 3 సారులు యిచ్చేది.

---

పల్వీస్ రీఐ ఎట్ సోడి (మలబద్ధముతొలగించుచూర్ణము)

రూబర్బ్ పౌడరు 4 గ్రయినులు

సోడియం బైకార్బొనేట్ 3 గ్రయినులు

జింజర్ పౌడరు లేక శొంఠిచూర్ణము—½ గ్రెయిను

ఇట్లు కలిపి యివ్వవలెను.

---

పల్వీస్ డోవరీఎట్ అమోనియై (దగ్గులుకుదురుటకుచూర్ణం)

డోవర్సు పౌడరు—½ గ్రయిను

యిపికాక్ పౌడరు—½ గ్రయిను

అమోనియం కార్బొనేట్—½ గ్రెయిను
సిన్నామన్ పౌడరు లేక దాల్చినచెక్క చూర్ణము
2 గ్రెయినులు

ఇట్లు మిశ్రమముచేసి రోజుకు 3 సారులు ఇచ్చేది.

---

ఇపికాక్ మిక్చర్—(దగ్గు తగ్గుటకు అరఖు)
వైనం యిపికాక్—3 మినిమములు
అమోనియం కార్బొనేట్—½ గ్రెయిను
తుమ్మజిగురుతో కలిపిన నీరు 1 డ్రాము

ఇట్లుచేర్చి రోజు 1కి 3 సారులు యివ్వవలెను.

కంటికి లోషను.

జింక్ సల్ఫేట్—1 గ్రెయిను
యాలం (పటిక) పొడి 2 గ్రెయినులు
బోరిక్ యాసిడ్—3 గ్రెయినులు
నిర్మలోదకము—1 ఔన్సు

ఈప్రకారం తయారుచేసిన లోషన్‌చుక్కలు కంటిలో వేసిన కండ్లకలకలు, ఎరుపులు, ఒరుపులు, దురదలు, మొదలగునవి హరించును.

---

చెవిలోపోటు తగ్గుటకు అరఖు

టించర్ ఆఫ్ ఓపియం—2 డ్రాములు
గ్లిసరైన్—2 డ్రాములు

ఈ రెంటినికలిపిన మిశ్రమపుచుక్కలు చెవిలో వేయవలెను.

చెవిలో చీముకారునప్పుడు చికిత్స

ముందుగా ఒక దూదెకుంచెతో చెవిలోని చీము తీసివేసి శుభ్రముచేసి తరువాత చెవిలో, యీ క్రిందిచూర్ణము వేయుచుండుము.

బోరిక్ యాసిడ్—1 డ్రాము
ఐడోఫారం—$\frac{1}{2}$

కలిపి సీసాలో భద్రపరచుకొని చెవిలో కొంచెము వేయుచుండవలెను.

---

నోరుపూసినప్పుడు పుక్కిలింతకు

పొటాసియం క్లోరస్—8 గ్రెయినులు
నీరు— 1 ఔన్సు

ఈప్రకారము ఎంతలోషను కావలెనో అంతయు చేసికొని పుక్కిలించుట కుపయోగింపుము.

నోటిపూతలకు, నాలుకమీద పొక్కులకు

పరిశుద్ధమైన బొరాక్స్—1 డ్రాము
గ్లిసరైన్—6 డ్రాములు

ఇట్లుకలిపిన మిశ్రమములో నొక దూదెకుంచె ముంచి నాలుకమీదను నోటిలోను రాయవలెను.

నోరుగాని నాలుకగాని పూసినప్పుడు వెంటనే విరేచనములగుటకు మందు పుచ్చుకుంటే మంచిది.

కొండనాలుక వ్రాలినప్పుడు, గొంతుక వాపునకును.

టానిక్ యాసిడ్—1 డ్రాము.

గ్లిసరైన్—5 డ్రాములు

ఈమిశ్రమమును వ్రాయుచుండు.

ఇటువంటి చిన్న చిన్న మిశ్రమములన్నియు యీ గ్రంథము చదువుటవలన చదువరులు సులభముగా చేసికొనవచ్చును. గ్రంథవిస్తరమగునని యింతటితో విరమించితిని.

---

## పేటెంటుమందులు.

| రోగము పేరు | మందు పేరు. |
|---|---|
| అజీర్ణము | టాకా డయాస్టేస్ |
| అతిమూత్రము. | జాంబులిన్ అండ్ కోడీన్ మాత్రలు |
| ఉబ్బసము | ఎలిక్సిర్ యుఫర్బియా కాంపౌండ్ |
| | 2 కోకిలానా కాంపౌండ్. |
| ఏనుగగజ్జి | ఏమోలియెన్స్ బైన్. |
| కలరా | 1 ప్రోడయోరియా మిక్చర్. |
| | 2 పొటాసియం పర్మాంగనేట్ మాత్రలు. |
| | 3 కలరా టాబ్లెట్సు. |
| గర్భాశయవ్యాధులకు | 1 ఎలెట్రిస్ కార్డియల్. |
| | 2 వైబర్నం కాంపౌండ్. |

| | |
|---|---|
| గ్రహణి(మామూలు) (కఠినమైనది) — | 1 క్లోరోడైన్. ఎమిటిక్ బిస్మత్ అయోడైడ్ మాత్రలు (పార్కు డెవిస్ కంపెనీ వారివి) |
| తలనొప్పి | ఆస్ప్రిరిన్ బిళ్లలు. |
| తలమీదచుండ్రు | స్టార్కాస్ల్ ఆయింటు మెంటు. |
| తేలుకాటు | ఎవల్ జెసిల్ బామ్. |
| నరములకుబలముచేయుటకు | 1 సిరప్ ఆఫ్ హైపోఫోస్ఫైట్స్. |
| | 2 డామియానా కాంపౌండు. |
| మలబద్ధముతొలగుటకు | కాస్కారా ఎవాక్యుయెంటు. |
| రక్తహీనతలో రక్తము పట్టించుటకు | సిరప్ ఆఫ్ హీమోగ్లోబిన్. |
| రక్తశుద్ధికిని,రక్తవృద్ధికిని | ఫెర్రోగ్లాస్ |
| వాపులు, కీళ్లనొప్పులకుబట్టీ | యాంటీఫ్లోజెస్టైన్ |
| విరేచనములగుటకు | ఫ్రూట్ సాల్టు |
| విరేచనములు(కట్టుటకు) | 1 కాంఫర్ డైన్. |
| | 2 పారిగమోరియా మిక్చర్ |
| వీర్యనష్టము | శాలిక్స నెగ్రా |

పైనుదహరించిన మందులన్నియు యింగ్లీషుమం

దులషాపులలో దొరుకును. వెలచేసి ఆయారోగములలో వాడుకొనవలయును.

---

## తేలికైన ఆహారవిశేషములు.

వ్యాధులలో రోగనిదానము ననుసరించి చేయువలసిన చికిత్సలు చేయుచున్నప్పుడుగాని చేసిన తరువాతగాని యీదిగువనుదహరించు తేలికాహారములను సమయానుకూలముగా వాడుచుండవలెను.

1 అరోరుటుపిండి; 2 బార్లీ; 3 సాగోలేక సగ్గుబియ్యము; 4 గ్లాక్సో; 5 హార్లిక్సు; 6 మెల్లిన్సు; 7 నెసల్సు; 8 సానటోజన్; 9 యాలన్‌బరీస్‌ఫుడ్; 10 ఓవల్‌టైన్; 11 గ్లూకోస్; 12 మిల్కుహ్వె; 13 లిక్విడ్‌పెప్టొనాయిడ్స్; 14 ఆల్బ్యుమిన్‌వాటర్; 15 గ్రేప్‌జ్యూస్ 16 ఎగ్‌ఎమల్షన్; 17 చికెన్‌బ్రాత్ లేక కోడిపిల్లచారు; 18 మట్టన్‌బ్రాత్ లేక మాంసపుచారు; 19 బీఫ్‌టీ లేక గొడ్డుమాంసపుసీను; 20 రామీట్‌జ్యూస్ లేక పచ్చిమాంసము యొక్క రసం; 21 ఫిష్‌పాష్ (బియ్యముతో తయారు కాబడెడు ఒకమాంసాహారము). పైనుదహరించిన వాటిలో చివరవి 7 ను మనముస్వంతముగా తయారు చేసుకోవలసియుండును. మిగతావి వెలకు దొరకును. అవి ఉపయోగించు విధానముకూడ వాటితో నే తెలుపబడును.

## పానీయములు.

1 కాఫీ; 2 తేనీరు; 3 కోకో.

## ఘనపదార్థముల తూనికలు

20 గ్రెయినులు=1 స్క్రూపిల్

60 గ్రెయినులు=1 డ్రాము.

8 డ్రాములు=1 ఔన్సు.

12 ఔన్సులు=1 పౌను.

---

## ద్రవపదార్థముల కొలతలు.

60 మినిమములు=1 డ్రాము.

8 డ్రాములు= 1 ఔన్సు.

16 ఔన్సులు= 1 పౌను.

20 ఔన్సులు= 1 పైంటు.

8 పైంటులు= 1 గాలను.

1 మినిము అనగా సాధారణముగా ఒకచుక్క లేక బొట్టు అని అనుకోవలయును.

1 టీస్పూన్= 1 డ్రాము.

1 డిజర్టుస్పూన్=2 డ్రాములు.

1 టేబిలుస్పూన్= $\frac{1}{2}$ అవున్సు.

1 వైన్గ్లాసు= $1\frac{1}{2}$ అవున్సులు.

ఈపుస్తకములో చెప్పబడిన మోతాదులు పెద్దవా

రికుపయోగపడును. చంటి పిల్లలకును, చిన్నవయస్సుగల వారికిని వయస్సునుబట్టి మోతాదులు తగ్గించుకొనవలెను.

ఈక్రింది వివరింపబడిన మోతాదులపట్టీకూడ కొంత సహాయకారిగా నుండును.

పెద్దవారికి 60 గ్రెయినుల మోతాదు అయినప్పుడు,

| | |
|---|---|
| 1 నెల వయస్సుబిడ్డకు | 3 గ్రెయినులు |
| 6 నెలల | 5 ,, |
| 1 సంవత్సరము | 8 ,, |
| 2 ,, | 9 ,, |
| 3 ,, | 12 ,, |
| 5 ,, | 15 ,, |
| 7 ,, | 20 ,, |
| 10 ,, | 30 ,, |
| 12 ,, | 40 |
| 15 ,, | 45 ,, |
| 20 ,, | 50 ,, |
| 21 ,, | 60 ,, |

ఈప్రకారము వయస్సునుబట్టి మోతాదుల హెచ్చుతగ్గులు చూచుకొనుచుండవలయును. ద్రవపదార్థములు యిచ్చినప్పుడుకూడ యీరీతిగానే కొలతలు చూచుకొని వాడవలెను.

## వైద్యపరికరణములు.

1 ఔన్సుగ్లాసు; 2 డ్రాముగ్లాసు, 3 గాజుకల్వము, 4 పింగాణీకల్వము, 5 శ్లాబ్ అనగా పొడర్లు చేసుకొనురాయి, 6 శ్పాట్యులా అనగా చూర్ణములు చేసుకొనుట కుపయోగపడుకత్తి; 7 థర్మామీటర్; 8 స్కేల్ (త్రాసుకట్లులసహా) 9 గాజుపిచికారీ, 10 గ్లిసరైన్ ఎనీమాసిరింజి, 11 సోప్ వాటర్ ఎనీమాకాన్ (పెద్దఎనీమాగొట్టము రబ్బరుట్యూబ్ తోసహా) 12 స్టెతెస్కోప్ (గుండెనుపరీక్షచేసేది) 13 డ్రాప్ బాటిల్ (కంటిలో అరఖుచుక్కలు బోసికొనుటకుబుడ్డి) 14 కార్కు స్క్రూ (సీసాలపై బిరడాలనుతీయుటకు) ఈ మొదలగు పరికరణములను సంపాదించుకోవలయును.

---

## థర్మామీటర్.

ఇది రోగియొక్క జ్వరమునుకొలుచు గాజుపుల్ల. దీనిమొదటిభాగమును రోగిచంకలో చెమటను తుడిచిడుంచవలెను. లేదా రోగినోటిలో నాలుకక్రిందపెట్టవలెను. రోగిస్మృతిలో లేనప్పుడు చంటిపిల్లల జ్వరముకొల్చవలసినవచ్చినప్పుడును ఆసనములోనుంచవలెను.

ఆరోగ్య స్థితిలో శరీరముయొక్క సామాన్యవేడిమి 98½ డిగ్రీలుండును. థర్మామీటరుతో రోగిజ్వరమును

కొలుచుటకు పూర్వము దానిలోని పాదరసము 98½ డిగ్రీలకున్న (Normal point) కు క్రిందికి దింపినతరువాత రోగి చంకలోగాని నోటిలోగాని పెట్టవలెను. రోగికిజ్వరము ఉన్నచో, సామాన్య ఉష్ణముఅనగా 98½ డిగ్రీలకు పైగా పాదరసం ప్రవహించును. ఆపాదరసం ఎంతగీటువరకు ఎక్కునో అన్నిడిగ్రీలవేడిమి ఉన్నదని గ్రహించవలెను. సామాన్యగుర్తువరకు అనగా 98½ డిగ్రీలవరకు పాదరసము యెక్కకదానికంటె క్రిందికి దిగిపోయి 97, 96, 95 డిగ్రీలగుర్తుగల చోట ఉన్నచో రోగినిస్త్రాణస్థితిలోనున్నాడని తెలుసుకొని అప్పుడు వెంటనేవానికి వేడిచేయుటకు మందులు యివ్వవలెను.

ధర్మామీటర్లలో చాలారకములుకలవు. రోగి ఉష్ణము అరనిమిషములో కొన్నియును, 5 నిముషములలో కొన్నియును దెలుపును. అరనిమిషపు ధర్మామీటరునే కొనుట చాలయుపయోగము. ఒకరోగియొక్క యుష్ణము కొలిచిన తరువాత ధర్మామీటరును క్రిందివైపునకు ఝాడించి దానిలోని పాదరసమును సామాన్యగుర్తుకంటె క్రిందికిదింపి కార్బాలిక్ లోషనలోకడిగి శుద్ధిచేసి రెండవరోగికి ఉపయోగించుటకు పనికివచ్చునట్లుగా సిద్ధపరచుకొనవలెను.

---

## జ్ఞాపకముంచుకోవలసినముఖ్యవిషయములు.

1 రోగియొక్క దేహతత్వము తెలిసేవరకు మందులు కొద్దిమోతాదులతో ప్రారంభించుటమంచిది.

2 గర్భిణీస్త్రీలకు తెగడవంటి బలమగు విరేచన ఔషధముల నివ్వరాదు అట్టివారికి విరేచనములు కావలెనన్నచో ఆముదమే బహుశ్రేష్టము.

3 నల్లమందుగాని నల్లమందుకలసిన యితరఔషధములుగాని పిల్లలకు బహుజాగ్రత్తగా కొద్దిమోతాదులలో నియ్యవలెను.

4 నల్లమందువంటి ఔషధములు ప్రతిదినము అలవాటుగా పుచ్చుకొనువారికి ఆజాతిఔషధములు యివ్వవలసివచ్చినప్పుడు పెద్దమోతాదులలో యిచ్చినగాని పని చెయ్యవు.

5 పురుగులనుచంపుటకు లోనికిచ్చెడు మందులు పరగడుపుననే యిచ్చిన బాగుగపనిచేయును.

6 ఔన్సు గ్లాసు, డ్రాముగ్లాసు ఉపయోగానంతరము పరిశుభ్రముగా కడిగి మరలనుపయోగించుటకు సిద్ధపరచుకొనుము.

7 విషసంబంధమైన మందులసీసాలపైన, విషమును తెలుపుగుర్తు ఉండవలెను. ప్రతిమందు సీసాపైనను కూడ చీటీ ఉండవలెను.

సమాప్తము.

---

## నాడి—Pulse.

నాడి, నిమిషమునకు యీ క్రిందివిధముగ కొట్టుకొనును.

| వయస్సు | | నిమిషము 1కి |
|---|---|---|
| పుట్టినశిశువుకు | | 140 మొ॥ 130 సా |
| 1 సంవత్సరము లోపల | | 130 మొ॥ 115 ,, |
| 2 ,, | | 115-100 ,, |
| 3 ,, | | 105-95 ,, |
| 3 సం॥ మొ॥ 7 సం॥వరకు | | 100-90 |
| 7 | 14 | 90-85 ,, |
| 14 | 21 | 85-75 ,, |
| 21 | 65 | 75-65 ,, |
| ముసలితనములోనున్న మనిషికి | | 85 కును 75 కి |

మధ్యదామాషాయిని పెద్దవారికి నాడి నిమిషమునకు 72సారులు కొట్టుకొనును.

## ఊపిరి—Respiration.

| | | నిమిషమునకు |
|---|---|---|
| 2 నెలలు మొ॥ 2సం॥వయస్సుగలవాడు | | 35సా॥ ఊపిరితీయును |
| 2 సంవత్సరములు మొ॥ 6 సం॥లు | | 23 |
| 6 సం | 12 | 20 |
| 12 సం | 15 | 18 |
| 15 | 21 | 16 మొ॥ 18సారులు |

ఆడవాండ్రు ముఖ్యముగా గర్భవతులు మగవారికంటె కొంచెము హెచ్చుగా ఊపిరితీయుదురు.

సాధారణము ప్రతిమనిషియును దామాషాయిని నిమిషమునకు 18 సారులు ఊపిరి తీసుకొనుచుండును.

## ఉష్ణము—Temperature.

ఆరోగ్యవంతుని ఉష్ణము దామాషాయని 98.4 డిగ్రీ లుండును. చంకలో ఉష్ణముకంటె, నాలుకక్రింద ఉష్ణము 1 డిగ్రీ హెచ్చుగానుండును. గుదస్థానములోన, యోని లోను అట్లే హెచ్చుగానుండును. శరీరవేడిమి ప్రొద్దుట నిద్రనుంచిలేచినవెంటనే హెచ్చుగాను, నిశిరాత్రియందు తక్కువగానుండును.

---

# సిద్ధౌషధములు

1 హిస్టరైన్—హిస్టీరియాఅనగా గర్భాశయోన్మాద మమూర్ఛ నరముల బలహీనత మొదలగు వ్యాధులకు అమూల్యమైనది. ఒకనెలకు సరిపడుమందు డబ్బీ 1కి రు5-0-0

2 ధాతుబంద్—శుక్లనష్టము స్వప్నస్ఖలనము నివారణయగును వీర్యము గట్టిపడును, రతి దారుఢ్యము గలుగ జేయును వీర్యస్తంభనచేయును ఒకనెలకు మందు రు4-0-0

3 డెస్మొరైన్—ఇది కఠినమైన ఋతునొప్పులను పోగొట్టును పరిశోధనలుచేసి కనిపెట్టబడినది 15 రోజులకు సరిపడు మాత్రలు డబ్బీ 1కి రు 2-0-0

4 ప్రదరాంతక్—మూడుజాతుల కుసుమలకు దివ్యౌషధరాజము అన్నిప్రమేహములలో కూడ పేరుపొందినది వెల డబ్బీ 1కి రు 5-0-0 (1 తులము మందు)

5 గర్భస్రావనివారిణి—గర్భస్రావము నిలిపి సత్సం తానము గలుగజేయును వంధ్యాదోషములను పోగొట్టి గర్భధారణ గలుగజేయును వెల 1తులము మందురు5_0_0

6 పార్శ్వపుతలనొప్పిమాత్రిలు—పార్శ్వపుతలనొప్పి దీనిని 7 దినములు సేవించుట వలన మరల తిరిగి ఎన్నటికిని రాదు. నిస్సంశయముగా కుదురును 15 మాత్రిలుగల డబ్బీ 1కి రు 2_0_0

7 డైజెస్టు—పైత్యము అజీర్తి మలబద్ధము దీనిని సేవించుటవలన పోవును బాలురు వృద్ధులు నిర్భయముగా సేవించవచ్చును తత్వము మార్చి మలబద్ధము తొలగించుటలో నిది ఘనతకెక్కినది వెల డబ్బీ 1కి రు 3_0 0

8 కామవర్ధనీ—నపుంసకత్వము, శుక్లనష్టము నరముల బలహీనత నిస్సత్తువ హరించును రక్తశుద్ధిచేయును, శరీర మాంసమును వృద్ధిచేయును, బలమైన ఆహారము.

వెల డబ్బా 1కి రు 4_0_0

యోగ్యతాపత్రికలకు వ్రాయుడు.

వీటన్నింటికి పోష్టు రిజిస్ట్రేషన్ ప్యాకింగుఖర్చులువేరు

డాక్టరు కె. బి. శర్మ.
పాలమూరు పశ్చిమగోదావరిజిల్లా

— వేమన పంచాంగ్ర(?) ... శాలయం,
తేలప్రోలు :: కృష్ణా జిల్లా.

49

# సుప్రసిద్ధవైద్య గ్రంథములు.

1 ఓషధీగుణపంచభాషి ఈ పుస్తకములో సుమారు 800 వనమూలికలపేర్లు 5 భాషలలో వ్రాయుటయే గాక వాట్లసిద్ధగుణములు వాటిని సేవించుటవలన కలిగినవికారమునకు శాంతులు అలబ్ధప్రతినిధివస్తువులు ప్రతినామములు మూలికలోనుండు ప్రాముఖ్యమైన పదార్థము (Active Principle) మొదలగునవి పెక్కుశాస్త్రములు పరిశీలించి వ్రాయబడినవి. వెల ప్రతి 1కి రు 1-0-0

2 ఆసవారిష్టదీపిక దీనిలో ఆసవములు అరిష్టలుచేయువిధము విపులముగా అనేకశాస్త్రములు పరిశీలించివ్రాయబడినది. వెల ప్రతి 1 కి రు 0-8-0

3 కుటుంబచికిత్సాదర్పణం :—ఇందాయుర్వేద సులభచికిత్సలు, ఉపాయములు, ప్రథమచికిత్సలు వ్రాయబడినవి. ప్రతియింట నుండదగినది. సాధారణముగ కుటుంబములోవచ్చెడు వ్యాధులకన్నింటికి ప్రతిమనుష్యుడు తెలిసికొనవలసియుండు చక్కని సలహాలు ప్రమాదములేని చికిత్సలు సూచించబడియున్నవి. వెల ప్రతి 1కి 4—0—0

4 తెలుగు మెడికల్ హాండుబుక్కు:—యిందు నిత్యకృత్యములో వాటిలో నుపయోగించుకొను ఔషధములు అనందభైరవి, శీతాంశురసము సన్నిపాతభైరవి,లక్ష్మీవిలాసరసము, గ్రహణికవాటం, వగైరా, చేసుకొనువిధమును శుద్ధులు చక్కగా ప్రతివానికి తెలిసేటట్లు వ్రాయబడినవి.

వెల ప్రతి 1కి రు 0—4—0

వీటికి పోస్టు రిజస్ట్రేషన్ ప్యాకింగువగయిరా ఖర్చులు వేరు.

డాటరు కె. బి. శర్మ పాలమూరు.

పశ్చిమగోదావరిజిల్లా.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B173 |
| పుస్తకం పేరు | వైద్య గ్రంథములు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 123 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2,40, ,B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |